భారతీయ సాహిత్య నిర్మాతలు

# చందుమీనన్

మూలం:

టి. సి. శంకరమీనన్

తెనుగుసేత:

కె. కె. రంగనాథాచార్యులు



సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

# విషయసూచిక

# రచయిత మాట

చందుమీనన్ను గూర్చి ఈ పుస్తకం రాయమని ఆహ్వానించి గౌరవించిన సాహిత్య అకాదెమీకి కృతజ్ఞతలు.

ఒక రచయితగా, అధికారిగా, వ్యక్తిగా ఆయన చాలా ఆసక్తిదాయక మైన వ్యక్తి. ఆయన గురించి కొంత తెలుసుకోవడం ప్రారంభిస్తే ఇంకా తెలుసుకోవాలనే కుతూహలం పెరుగుతూ ఉంటుంది. మేము విషయ సేకరణ ప్రారంభించినప్పుడు ఆయన జీవిత విశేషాలు పరిమితంగా మాత్రమే తెలియడం నిరుత్సాహాన్ని కల్గించింది. కాని ఇప్పటికే చాలా ఆలస్యం జరిగి పోయింది. చందుమీనన్ మరణానంతరం డెబ్బై ఏళ్ళ తర్వాత కొత్త విశేషా లను కనుక్కోవడం సాధ్యం కాదు.

ఈ పుస్తకంలోని చందుమీనన్ జీవితంలో ఇంతకుముందు ప్రచురింప బడిన గ్రంథాలలోకంటే విశేషమేమీ లేదు. ఈ గ్రంథాంతంలో ఇచ్చిన, ముద్రణలో లభిస్తున్న పుస్తకాల సహాయంతో ఈ పుస్తకాన్ని తయారు చేశాను. కాని వాటిలో రెండు పుస్తకాలుతప్ప తక్కినవన్నీ మలయాళంలోనే ఉండ డంచేత అవి మలయాళం తెలియని వాళ్ళకు ఉపయోగపడవు.

చందుమీనన్ ఒక పూర్తినవల 'ఇందు లేఖ'ను, మూడుభాగాలుగా రాయాలనుకున్న 'శారద' నవలలో ఒక్క భాగాన్ని మాత్రమే రాశాడు. 'ఇందులేఖ' మలయాళంలో 1889 లో ప్రచురింపబడింది. 1890 లో సివిల్ సర్వీసుకు చెందిన శ్రీ జార్ఓిల్లోబీ ఫ్రాన్సిస్ దూమెర్గ్ ఇంగ్లీషులోకి అనువదిం చాడు. ఒక ఇంగ్లీషువాడికి బాగా నచ్చి అనువాదానికి ప్రేరేపించిన మొదటి మలయాళ నవల ఇందులేఖ. గడచిన సంవత్సరాలలో అసంఖ్యాకంగా ప్రచురింపబడిన మలయాళనవలల్లో ఒక ఇంగ్లీషువాడికో విదేశీయుడికో అనువ దించాలనే బుద్ధిపుట్టించేంత మంచి నవలలు ఎన్నివచ్చాయో నాకు సందే హమే. ఇందులేఖ ప్రతినొకదాన్ని పంపిస్తూ దూమెర్గ్‌కు ఒక ఆసక్తికరమైన లేఖ రాశాడు చందుమీనన్. ఇది అనువాదంతోపాటు ప్రచురింపబడింది. చందుమీనన్ తన ఆంగ్లానువాదాన్ని పరిశీలించి అవసరమైన మార్పుల్ని సూచించాడని దూమెర్గ్ తన ఆముఖంలో చెప్పాడు. కాబట్టి అనువాదం

రచయిత ఆమోదాన్ని పడసిందని చెప్పవచ్చు. ఈ గ్రంథంలో 'ఇందులేఖ' నుండి ఉదహరించిన భాగాలు దూమెర్గ్ అనువాదంలోవే. ఈ అనువాదం రెండో ప్రచురణ మాతృభూమి పబ్లిషింగ్ కంపెనీ, కాలికట్, కేరళవారు 1965 లో వెలువరించారు

నాకు తెలిసినంతవరకు 'శారద్'కు ఇంగ్లీషు అనువాదంలేదు. అందువల్ల ఈ పుస్తకంలో చందుమీనన్ రాసినంతవరకూ కథా సారాంశం ఇవ్వడం అవసరమని భావించాను ఈ గ్రంథంలో ఉదహరించిన 'శారద' లోని భాగాలు మూలమలయాళ గ్రంథానికి నా అనువాదాలే. ఏ భాగమైనా మూలానికి న్యాయం చేకూర్చలేకపోతే దోషం నాదే.

నేనీ గ్రంథం రాతప్రతిని పూర్తిచేసింతర్వాత అంత సులభం కాకపోయినా పుస్తకం అంతా జాగ్రత్తగాను, అతి ఒపికగాను ఎర్నాకులం మహారాజా కాలేజీ ప్రొఫెసరు పి. బాలకృష్ణన్ నాయరుగారు పరిశీలించారు. పాఠకుల దృక్కోణాన్ని మరింతగా స్పష్టంగా చూడడానికి మా చర్చలు పనికివచ్చాయి. తర్వాత టైపుప్రతిని శ్రీ పి. డి. ఎన్. మీనన్ (రిటైర్డు న్యాయమూర్తి, కేరళ హైకోర్టు), శ్రీ బి బి. కె. మీనన్ (రిటైర్డు ప్రధాన కార్యదర్శి. కేరళ ప్రభుత్వం) గార్లు చూశారు. ఈ మోనోగ్రాఫు ప్రమాణాన్ని పెంచడానికి తగిన సలహాలనిచ్చిన పైవాళ్ళందరికీ నా కృతజ్ఞతలు.

దేవీ నివాస్,
థేవరరోడ్,
కొచ్చిన్-16.

టి. సి. శంకరమీనన్
14 డిసెంబరు, 1971.

పాదపీఠికల్లో సుదీర్ఘ ఉదాహరణలకిచ్చిన పేజీ రెఫరెన్సులు దూమెర్గ్ 'ఇందులేఖ' అనువాదం రెండోప్రచురణ, మాతృభూమి ప్రింటింగ్ అండ్ పబ్లిషింగ్ కంపెనీ లిమిటెడ్, కాలికట్-1, కేరళ నుంచి ఇవ్వబడ్డాయి.

# 1

# చందు మీనన్

'నే నెరుగని స్నేహితులకి నన్ను పరిచయం చేశావు
నావికాని అనేక గృహాలలో నాకు ఆశ్రయం కల్పించావు
నాకు దూరంగా ఉండేవాళ్ళని దగ్గరికి చేర్చావు
అపరిచితుణ్ణి సోదరుణ్ణిగా చేశావు.'

— ఠాగూరు

## I

ఇది ఒక మార్గదర్శకుని కథ. మలయాళ సాహిత్యరంగంలో నూతన పథాన్ని నిర్దేశించిన ఒక మహనీయుని గాథ. ఢిల్లీని మినహాయిస్తే భారత దేశంలోని ఇతర రాష్ట్రాలన్నిటికంటె ఎక్కువ మంది విద్యావంతులున్న రాష్ట్రం కేరళ. ఈ రాష్ట్రప్రజల భాష మలయాళం. అది భారత, జాతీయ భాషలు పధ్నాలుగింటిలో ఒకటి. ఇది సంస్కృత, తమిళ భాషలతో ప్రత్యేక సంబంధం కల్గిఉన్నా, తనదంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకున్న భాష. శతాబ్దాల క్రమపరిణామ చరిత్రగల మలయాళం 17వ శతాబ్దినాటికి ఆధునిక రూపాన్ని సంతరించుకుంది. మలయాళ సాహిత్య పితామహుడని పేరుపొందిన తుంజత్ ఎళుత్తచ్ఛన్ ఆధునిక మలయాళాన్ని రచనాలోకంలో ప్రవేశపెట్టాడు. మలయాళానికి నేడు సంపన్నమైన సాహిత్య సంప్రదాయం ఉంది. వచనం, పద్యం, నాటకం మొదలైన అన్ని శాఖల్లోనూ మరింత వేగంగా పురోగమిస్తూంది.

ఇతర భాషల సాహిత్యప్రమాణాలతో పోల్చి మలయాళ సాహిత్యం గొప్పదనాన్ని చెప్పాలంటే 1969 లో మొట్టమొదటిసారిగా భారతీయ జ్ఞాన

పీఠ బహుమానం ఇచ్చినప్పుడు, అది మహాకవి జి. శంకరకురుప్ మలయాళ కవితా సంకలనానికే రావడం ఒక ఉదాహరణగా చెప్పవచ్చు. ఏ భారతీయ భాషలోనైనా అత్యుత్తమ రచన కిచ్చే అత్యున్నత జాతీయ బహుమానం ఇది. అంతేకాక అనేక మలయాళ పద్య గద్య రచనలు వాటి ఉన్నత ప్రమాణాలు, అధిక ప్రచారం కారణంగా ఇంగ్లీషు మొదలైన ఇతర భాషల్లోకి తర్జుమా అయ్యాయి.

అటువంటి అనువాదాలలో 1890 లో వచ్చిన మలయాళ నవల 'ఇందులేఖ' ఆంగ్లానువాదం మొట్టమొదటి వాటిల్లో ఒకటై ఉంటుంది. ఈ మలయాళ నవలారచయిత రావుబహదూర్ ఓ. చందుమీనన్. అనువాదకుడు జె. డబ్ల్యు. ఎఫ్. డూమెర్గ్ అనే ఆంగ్లేయ సివిల్ అధికారి. రచయిత వృత్తి రీత్యా రచయిత కాదు. ఒక న్యాయాధికారి. తన భార్య, మరి ఇతర మిత్ర బృందం సంతోషం కోసమే ఈ నవల రాశాడు. ఏమైతేనేం ఆది వెంటనే ఆ కాలంలో విస్తృత ప్రచారాన్ని పొందింది. విమర్శకులు దాన్ని మలయాళ సాహిత్యాని కొక విలువైన కానుకగా గుర్తించారు.

## II

రచయిత తండ్రి శ్రీ ఎతపతి చందునాయర్ (1805 - 1857) కూడా ఒక న్యాయాధికారే. ఉత్తర కేరళలోని కొట్టాయం తాలూకాలోని పీనరాయి అంశంలో కేలలూరు సబ్ డివిజన్‌లో ఈయన జన్మించాడు ఆ ప్రాంతంలో పాఠశాలా సదుపాయం చాల తక్కువ. అయినా చందూనాయర్ మలయాళంలో విద్యాభ్యాసంచేసి, ఇంగ్లీషులో కూడా కొంత పరిచయం గడించాడు. తెల్లిచ్చేరి కలెక్టరాఫీసులో ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించాడు. పై అధికారులు ఈయన శక్తిసామర్థ్యాలను గమనించి ప్రమోషన్లిచ్చారు. 1837 కే మేజిస్ట్రేటు అయ్యాడు. 8 సం॥ ల తర్వాత తహసీల్దారై మలబారులో అనేక ప్రాంతాల్లో పనిచేశాడు.

ఈయన రెండుసార్లు పెళ్లి చేసుకున్నాడు. ఈయన రెండవ భార్య పార్వతిఅమ్మ కొడుంగళ్ళూరు దగ్గర చిట్టెరపూత్ కుటుంబానికి చెందిన స్త్రీ.

ఈ దంపతులకు 5 గురు సంతానం. చందుమీనన్ అందరికంటె చిన్నవాడు. ఆయన *1847 జనవరి 9 వ తేదీన జన్మించాడు.

పదేళ్ళ తర్వాత 1857 లో 52 సంవత్సరాల వయస్సులో మధు మేహ వ్యాధివల్ల చందునాయర్ మరణించాడు.

చందునాయర్ తెల్లిచ్చేరిలో తహసీల్దారుగా ఉన్నప్పుడు అక్కడ కొంత స్థలాన్ని కొని ఒక ఇల్లుకట్టి దాన్ని స్థిరనివాసంగా చేసుకున్నాడు. దానికి ఒయ్యారథ్ అనిపేరు. బహుశా చందుమీనన్ అక్కడే పెరగడంవల్ల కాబోలు ఒయ్యారథ్ చందుమీనన్ అనిపేరు పొందాడు.

తండ్రి చనిపోయినప్పుడు చందుమీనన్ పదేళ్లవాడు. తల్లి పార్వతి అమ్మ వాత్సల్యానురాగాలలో పెరిగి పెద్దవాడయ్యాడు. పొరుగువాడైన కొరన్ గురుక్కల్ వద్ద చందుమీనన్ మొదటి పాఠాలు నేర్చుకొన్నాడు. కుంజంబు నంబియార్ పండితుడు. ఈయన రెండవ గురువు. ఈయన సంస్కృత కవిత్వం, నాటకాలు, వ్యాకరణం బోధించాడు. అదే సమయంలో స్థానిక పాఠశాలలో ఇంగ్లీషు పాఠాలు నేర్చుకున్నాడు. తర్వాత, అప్పుడు తెల్లిచ్చేరి సివిల్ కోర్టులో ఇంగ్లీషు అనువాదకుడుగా ఉండి, క్రమంగా సబ్ జడ్జి అయిన కె కుంజన్ వద్ద చదువుకున్నాడు. చదువుకుంటున్న కాలం లోనే సివిల్ సర్వీసు పరీక్షలో ఉత్తమశ్రేణిని సంపాదించి సివిల్ సర్వీసుకు

---

* శ్రీ పి. కె. బాలకృష్ణన్ చందుమీనన్‌ను గూర్చి రాసిన తన పుస్తకంలో ఈయన జన్మసంవత్సరం 1845 అని ఇచ్చాడు. (పే. 213. Edn. 1971). శ్రీ పి. కె. పరమేశ్వరన్ నాయర్ తన 'మలయాళ సాహిత్య చరిత్రం' లో 1846 అన్నాడు (పే. 118. Edn. 1958). శ్రీ పాలనారాయణ అయ్యర్ 'శారద' నవలకు చేర్చిన చందుమీనన్ సంక్షిప్త జీవిత చరిత్రలో మలయాళ – ఇంగ్లీషు శకాలు రెండింటిలోను 22 ధను. 1022 (1846) అని ఇచ్చాడు (పే. 223).

N. B. S. (ఎడిషన్ 1959). చందుమీనన్ స్నేహితుడూ, జీవిత చరిత్రకారుడూ ఐన శ్రీ మూర్కోత్ కుమారన్ మలయాళ తేదీ 22 ధనుర్మాసం 1022 అని ఇచ్చాడు. చందుమీనన్‌కు స్నేహితుడు కావడంచేత ఈ తేదీని ప్రమాణంగా అంగీకరించవచ్చును. ఈ మలయాళ తేదీకి సమానమైన ఇంగ్లీషు తేదీ జనవరి 9, 1847.

యోగ్యతను పొందాడు. అయినా చదువు కొనసాగించాడు. అతను మెట్రిక్యు లేషను తరగతిలో ఉన్నప్పుడు 1864 లో తల్లి చనిపోయింది. దానితో చదువుకు స్వస్తిచెప్పాడు.

## III

అప్పుడు చందుమీనన్ వయస్సు 17 సంవత్సరాలు. ఏదో ఒక ఉద్యోగం వెతుక్కోవడం అవసరం అనుకున్నాడు. తెల్లిచ్చేరిలోని స్మాల్ కాజెస్ కోర్టులో గుమస్తా ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాడు. అతని సామర్థ్యాన్ని పరిశీలించడానికి ఇంటర్వ్యూ చేసిన న్యాయాధికారి శ్రీ టి. ఆర్. షార్ప్‌ని ఆయన ఆకర్షించాడు. చందుమీనన్‌ను వెంటనే తెల్లిచ్చేరి సివిల్ కోర్టులో ఆరవ గుమస్తాగా నియమించారు.

ఈ ఉద్యోగంలో చేరిన మూడుసంవత్సరాల తర్వాత అతని అసాధారణ శక్తిసామర్థ్యాలు అప్పటి సబ్‌కలెక్టరు లోగన్‌కు తెలిసి చందుమీనన్ తనకు కావాలని కోరాడు. బదిలీని ఒప్పుకున్నారు. లోగన్ చందుమీనన్ను తన ఆఫీసులో 3 వ గుమస్తాగా వేసుకున్నాడు. స్వల్పకాలంలోనే ఆయన మొదటి గుమస్తా అయ్యాడు. 1871 నాటికి కాలికట్ సచివాలయంలో హెడ్ మున్షీ అయ్యాడు. ఒక కావ్యంగా గుర్తింపుపొందిన మలబారు జిల్లా మాన్యువల్‌ను తయారుచేయడంలో ఈయన లోగన్‌కు చాలా సహాయపడ్డాడని అంటారు.

జస్టిస్ షార్ప్ తాను నియమించిన ఉద్యోగి పనిని, పురోగతిని పరిశీలిస్తూనే ఉన్నాడు. అందుకనే ఆయన 1872 లో కాలికట్ జిల్లాజడ్జిగా వచ్చినప్పుడు చందుమీనన్‌ను సివిల్ కోర్టులో హెడ్‌క్లార్కుగా నియమించాడు.

చందుమీనన్ జీవితంలో 1873 వ సంవత్సరం చాలా ముఖ్యమైంది. ఎందుకంటె ఆ సంవత్సరంలోనే ఆయన గుమస్తా జీవితం పూర్తయింది. ఆయన కార్యనిర్వహణకు తృప్తిచెందిన ప్రభుత్వం ఆయన్ని పట్టాంబిలో తాత్కాలిక మున్సిఫ్‌గా నియమించింది. తొందరగానే ఆ ఉద్యోగంలో పర్మనెంట్ అయ్యాడు. మున్సిఫ్‌గా ఆయన మంచేరి, పాలఘాట్, ఒట్టప్పాలమ్, కాలికట్ మొదలైనచోట్ల పనిచేశాడు. 1886 నుండి 1892 వరకు పరప్పనం గుడిలో జిల్లామున్సిఫ్‌గా పనిచేస్తూ 1890 లో తన గొప్పనవల

'ఇందులేఖ'ను ప్రచురించాడు. ఆయనెక్కడెక్కడ పనిచేసినా తనపై అధి కారుల మన్ననలను అందుకున్నాడు ఒక విధంగా లోగన్, షార్పులు చందుమీనన్ కొరకు పోటీపడ్డారని చెప్పవచ్చు. దూమెర్గ్, డేవిడ్స్ మొ॥ మరికొంతమంది కార్యనిర్వహణలో ఆయన తెలివితేటల్ని మెచ్చుకున్నారు. ఈ అధికారులు మీనన్‌కంటే చాలా సీనియర్లు అనే విషయాన్ని, వాళ్ళు ఇంగ్లీషు వాళ్ళనే విషయాన్ని, మరీముఖ్యంగా అవి బ్రిటిషు సామ్రాజ్యపు రోజులని మనం గుర్తుంచుకోవాలి. పై అధికారుల్ని మీనన్ ఆకర్షించడానికి అతడు తక్కినవాళ్లకంటె యోగ్యుడైన గుమస్తా కావడంకాని, డిక్టేషన్ రాయగలగడంకాని కారణం కాదు. ఆయనలో ఒక సూక్ష్మపరిశీలనాశక్తిని, అభినివేశంగల పండితుణ్ణి, చొరవగల తెలివిని, చురుకైన తీర్పరితనాన్ని, ఒక విషయాన్ని అర్థంచేసుకోవడంలోని ఉపజ్ఞను, విషయ వితరణలోని సౌల భ్యాన్ని వాళ్ళు గుర్తించి ఉంటారు. ఒక ప్రతిభావంతుడైన జిల్లామున్సిఫ్‌గా, గొప్ప పండితుడిగా, మలబారు ప్రాంతపు చట్టానికి, ఆచార వ్యవహారాలకి చక్కగా అర్థం చెప్పగలిగిన వాడిగా గుర్తింపును పొందటానికి బహుశా ఆయన చాలా బాగా పనిచేసి ఉంటాడు. అందుకే 1890 లో మలబారు మ్యారేజి కమిటీని నియమించినప్పుడు సర్. టి. ముత్తుస్వామి అయ్యర్, సర్ సి. శంకరన్‌నాయర్‌వంటి ఉన్నతులలో సమానంగా అందులో సభ్యు డయ్యాడు. ఈ సంఘం మరుమక్కత్తాయం కుటుంబాలలో వివాహాలను గురించి, ఆ వ్యవస్థలో అవసరమైన మార్పులనుగురించీ నివేదిక సమర్పిం చాలి. 1891 లో నివేదిక వచ్చినప్పుడు చాలామంది సంస్కరణలను ఒప్పు కోగా చందుమీనన్ తన అసమ్మతిని సూచించాడు. తన అసమ్మతిపత్రంలో చాలాకాలంగా గౌరవింపబడుతున్న పద్ధతులలోను, ఆచారాలలోనూ మార్పు లకు అభ్యంతరం చెప్పాడు. ఆయన మరుమక్కత్తాయం కుటుంబాలలోని వివాహపద్ధతుల్ని విశ్లేషణాత్మకంగా వివరించి చాలాకాలంగా ఉన్న స్థానిక ఆచారాల పవిత్రత, అధికారం వాటికి ఉన్నాయనీ, కాబట్టి వాటిలో మార్పు తేవడం ఆవశ్యకంగానీ, వాంఛనీయంగానీ కాదని, ఆ పద్ధతులకు చట్టబద్ధ మైన గుర్తింపు, స్థానం కల్గించడం ఒక్కటే తేవలసిన సంస్కరణ అనీ ఆయన వాదించాడు. సర్ శంకరన్‌నాయర్ చందుమీనన్‌ల మధ్య విషయా లలో అభిప్రాయభేదాలున్నా, సర్ ముత్తుస్వామి అయ్యర్, చందుమీనన్‌ల

* చివర ఇచ్చిన అసమ్మతి పత్రంలోని భాగాలను చూడండి.

మధ్య మాత్రం పరస్పర అవగాహన ఉండేది. ఆ రోజుల్లో చాలా ప్రసిద్ధి పొందిన ఈ అసమ్మతి పత్రం చందుమీనన్ వివిధ సమస్యల విషయంలో స్వతంత్రమైన నిర్ణయం తీసుకొనగలిగిన వాడనడానికీ, దృఢ నిశ్చయంగల వాడనడానికీ నిదర్శనం. అప్పటి మద్రాసు ప్రభుత్వం అప్పుడు వాడుకలో ఉన్న విధానాన్నే ఏ విధమైన మార్పులూ చేయకుండా ఆమోదించింది.*

1892 లో ఆయన అర్హతలను గుర్తించిన ప్రభుత్వం తిరునల్వేలిలో సబ్ జడ్జిగా నియమించింది. అక్కడే ఆయన 'శారద' నవలను మొదలుపెట్టి పూర్తిచేయలేకపోయాడు. తర్వాత కొన్ని నెలలకు 1893 లో సబ్‌జడ్జి పదవి స్థిరం అయి మంగుళూరుకు బదిలీ అయ్యాడు. పక్షవాతం రావడంవల్ల అక్కడ ఎక్కువకాలం ఉండకుండా సెలవుమీద వెళ్లవలసి వచ్చింది. ఈ సమయంలో 'శారద' నవలా రచన కూడా కుంటువడింది. ఆయన మళ్లా 1896 లో ఉద్యోగంలో చేరగానే కాలికట్టుకు బదిలీ అయ్యాడు.

మలయాళ సాహిత్యంతో చందుమీనన్ ప్రతిష్ఠను ఇనుమడింపచేసింది 'ఇందులేఖ', 'శారద' నవలలే. అయితే ఈ రెండుమాత్రమే ఆయన సాహిత్య వ్యాసంగంలో భాగాలుకావు. ఈయన కేరళవర్మ వలియ కోయిల్ తంపురన్ (కేరళ కాళిదాసు) పద్యరచనతో ప్రభావితుడై 'మయూర సందేశా'న్ని తన స్వంత ఖర్చుతో అచ్చువేయించి, దానికి ఆ ముఖం తానే రాసి ప్రతులను తన మిత్రులకు అందజేశాడు. కుంజి శంకరన్ నంబియార్ రచించిన 'నారిచరితమ్' (శార్దూల చరిత్ర) అనే పద్యకావ్యాన్నికూడా తానే ఆముఖం రాసి ముద్రింపజేశాడు. స్వభావసిద్ధంగా చందుమీనన్ వార్తాపత్రికలమీద ఆసక్తి లేనివాడు. శ్రీ పి. కె. పరమేశ్వరన్ నాయర్ రాసిన 'ఆధునిక మలయాళ సాహిత్యం' అనే గ్రంథం మూలంగా చందుమీనన్ రెండు ఆంగ్లోపన్యాసాలు, ఒకటి 'ప్రాచీన కాలంలో న్యాయవ్యవస్థ', రెండవది. సర్ టి. ముత్తుస్వామి అయ్యర్ స్మారక సంఘం సభలో ఇచ్చినదీ పుస్తక రూపాన్ని ధరించినట్లు తెలుస్తున్నది.

పై అధికారులకు చందుమీనన్ ఒక అసాధారణ సామర్థ్యం, ప్రతిభ ఉన్న అధికారి అని తెలుసు. పీటర్ సూత్రానికి అపవాదంగా ఆయన ప్రతి ప్రమోషన్ స్థాయిలోను తన సామర్థ్యాన్ని నిరూపించుకున్నాడు. 1892 లో

* చివర ఇచ్చిన అసమ్మతి పత్రంలోని భాగాలను చూడండి.

ఇంగ్లాండు ప్రధాని డబ్ల్యు. ఇ. గ్లాడ్‌స్టోన్ నుంచి చందుమీనన్‌కు ఒక ఉత్తరం వచ్చింది. అందులో ఆయన 'ఇందులేఖ', 'శారద' నవలలు రాయడం ద్వారా మలయాళ సాహిత్యానికీ, తద్వారా భారతదేశానికి చందుమీనన్ చేసిన సేవను విక్టోరియా రాణి ప్రశంసించినట్లుగా పేర్కొన్నాడు. భారతప్రభుత్వం 1897 లో చందుమీనన్‌కు రావుబహాదూరు బిరుదం ఇచ్చింది. 1898 లో ఈయన ప్రతిభను గుర్తించి మద్రాసు విశ్వవిద్యాలయం న్యాయపట్టాలకు పరీక్షకుడిగా నియమించింది. విశ్వవిద్యాలయ సభ్యుడిగా కూడా నియమించి గౌరవించింది.

1899 లో చందుమీనన్ మరణం ఆకస్మికంగా జరిగింది. అది సెప్టెంబరు 7 వ తేదీ, గురువారం మధ్యాహ్నం. రోజూటికంటె కొంచెం ముందుగా ఆయన కోర్టునుంచి ఇంటికి తిరిగి వచ్చాడు. కొంచెం అల్పాహారం తీసుకుని పడక కుర్చీలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఒక పాత న్యాయవాది స్నేహితుడు ఆయన్ను చూట్టానికి వచ్చాడు. ఇద్దరూ న్యాయశాస్త్ర విషయాలను చర్చించుకుంటున్నారు. మీనన్‌కు బాగా లేదనిపించి పడగ్గదివైపు బయలుదేరాడు. మధ్యలోనే అడుగులు తడబడి పక్కనే ఉన్న కోచ్‌మీద కూర్చున్నాడు. అంతే, ఒక మహత్తర జీవితం ముగిసింది.

## IV

ఆయన మరణించే నాటికి భార్య, ఆరుగురు పిల్లలూ ఉన్నారు. పాతిక సంవత్సరాల వయస్సులో 1872 లో ఆయన వివాహం జరిగింది. కంజోలీ కుటుంబానికి చెందిన లక్ష్మీకుట్టిఅమ్మ అనే 13 ఏళ్ళ అమ్మాయి పెళ్ళికూతురు. ఈమె తండ్రి కృష్ణమీనన్‌ది వరచ్చల్ కుటుంబం. ఈయన మధ్య కేరళలోని ఇరింజలకుడలో కూడల్ మాణిక్యమ్ దేవాలయానికి సంబంధించిన అధికారి. తల్లి కంజోలీ కుటుంబానికి చెందిన లక్ష్మీఅమ్మ. చందుమీనన్, లక్ష్మీకుట్టి అమ్మలకు 5 గురు కుమారులు, ఒక కుమార్తె. లక్ష్మీకుట్టి అమ్మ 67 సం॥ల వయస్సులో మరణించింది. ఈమె సాహిత్యంలో మంచి అభిరుచి, సంగీతంలో మంచి ప్రవేశం ఉన్న సంస్కారవతి. భర్తపై అమితానురాగం, ఆయన అభిరుచులు, ప్రతిభలను గూర్చిన మంచి అవగాహనలతో ఆమె చందుమీనన్‌కు తగిన భార్య అనిపించుకుంది. 'ఇందులేఖ'

వంటి మధురమైన నవల రాయడానికి తన భర్తను చాలా ప్రోత్సహించిన వ్యక్తిగా, స్నేహితురాలిగా, ప్రోద్బలంగా ఆమెను మలయాళ సాహిత్య ప్రియులు గుర్తుంచుకుంటారు. చందుమీనన్ 'ఇందులేఖ' ఆంగ్లానువాదకుడైన డూమెర్గ్‌కు రాసిన ఉత్తరంలో, తాను ఆ నవల రాయడానికి కారణాలను వివరిస్తూ "ఇంగ్లీషు నవలల పద్ధతిలో తన మాతృభాషలో రాసిన ఒక నవలను చదవాలని తన భార్య తరచుగా వ్యక్తంచేసే కోరిక మొదటి కారణంగా" చెప్పాడు.

## V

తన కుటుంబ సభ్యులతోను, స్నేహితులతోను చందుమీనన్ సంబంధాలు చాలా బాగుండేవి. ఆయన వ్యక్తిత్వం ఆకర్షణీయంగా ఉన్నట్లే, ఆయన ప్రవర్తన కూడా ఆసక్తిదాయకంగానూ, హృదయాకర్షకంగానూ ఉండేది. ఆయన నైతికంగానూ, శారీరకంగానూ కూడా ఉన్నతుడు. ఆరడుగులపైన పొడవూ, తగిన లావూ, పచ్చని చాయతో అందంగా ఉండేవాడు. నా ముందున్న ఛాయాచిత్రంలో తెల్లని తలపాగా ఆయన ఎత్తుకు మరో ఆరంగుళాలను కలుపుతున్నది. టై లేకుండా ఓపెన్ కోటు వేసుకుంటాడు. టై లేకపోవడమే కాక ఆయన వస్త్రధారణలో మరో విచిత్రం ఉంది. కోటు గుండీలు పెట్టుకొని దానిమీద దట్టీ కట్టుకునేవాడు. ఒకాయన చమత్కారంగా గుండీలు, బెల్టు రెండూ ఉపయోగించేవాడు నిరాశావాది అన్నాడు. చందుమీనన్ ఈ రెండూ ఉపయోగించి కూడా షరాయిని ఉపయోగించలేదు. కాని నిరాశావాదిమాత్రం కాదు. ఫొటోలోని ఆకళ్ళూ, పెదవులూ ఆయనలోని కరుకుదనాన్ని, దృఢనిశ్చయాన్నీ సూచించవచ్చు. కాని వాటి వెనక ఎక్కడో తను వేసినవో, తనపై వేసినవో, పరిహాసాలతో ఉదారంగా పెల్లుబికిన హాస్యం నిండిన జలాశయం ఉండేది. అటువంటి సున్నితమైన హాస్యదృష్టిలేకపోతే 'ఇందులేఖ' వంటి ఆహ్లాదకరమైన నవలను రాసి ఉండగలిగేవాడు కాదు. ఆయన వేసిన చెణుకులు కొన్నింటిని మలయాళభాషతో పరిచయం ఉన్నవాళ్లు మాత్రమే ఆస్వాదించగలుగుతారు. ఒకసారి ఒక మిత్రుడు చందుమీనన్ను ఆయన కూతురు గూర్చి అడిగాడు. ఆయన పాట్టం నిచ్చానని జవాబిచ్చాడు. పాట్టత్తిల్ కుటుంబానికి చెందిన న్యాయమూర్తి నారాయణ మీనన్‌కు ఆమెనిచ్చి వివాహం చేశాడు.

మలయాళంలో 'పాట్టం అంటే అద్దె అని అర్థం. పై చందుమీనన్ మాటకు పాట్టత్తిల్ కుటుంబంలో ఒకళ్ల కిచ్చానని, లేక అద్దెకిచ్చానని రెండర్థాలు. మీ ఇష్టం వచ్చినట్లు అర్థం చేసుకోవచ్చు.

అయితే ఆయన హాస్యప్రియత్వాన్ని తెలిపే అనేక సంఘటనలు ఇట్లా మాటల్లోకాక, మలయాళం తెలియనివాళ్లు కూడా ఆనందించగలిగినవి ఎన్నో ఉన్నాయి. చందుమీనన్‌ది భారీ శరీరం అని మనకు తెలుసు. ఆయనకు పెద్ద బొజ్జ ఉండేది. ఒకసారి దర్జీవాడి దుకాణం నుంచి ఒక పిల్లవాడు ఆయన కోటు కొలతలు తీసుకోవడానికి వచ్చాడు. ఆయన చుట్టుకొలత ఎక్కువగా ఉండడంవల్ల పాపం ఆ చిన్నపిల్లవాడు తనకు తానుగా ఒక్కడే కొలత తీసుకోలేకపోయాడు. 'అయ్యా! ఒక చివర తమరు పట్టుకోండి. రెండో చివరతో నేను చుట్టూ తిరిగి వస్తాను' అన్నాడాపిల్లవాడు. అదే మరొకరితో అయితే ఆ పిల్లవాడు చెంపదెబ్బలు తినేవాడు. చందుమీనన్ హాస్యప్రియుడు కావడంచేతా, ఆ పిల్లవాడి అమాయకత్వాన్ని, అవస్థనూ అర్థంచేసుకోవడంవల్లా, వాడి ప్రార్థన వినగానే విరగబడి నవ్వాడు. పైగా ఒక రూపాయి బహుమానం కూడా ఇచ్చాడు.

ఒక బ్రాహ్మడికి మాత్రం ఆ అదృష్టం లేకపోయింది. అతను ధన సహాయం అర్థిస్తూ తాను సంగీత విద్వాంసుణ్ణనీ, ఫిడేలు వాయిస్తాననీ చెప్పుకున్నాడు. 'అయితే సరే! వినిపించ'మన్నాడు చందుమీనన్. ఆ బ్రాహ్మడు రెండు మూడు ముక్కలు పాడగానే చందుమీనన్ అకస్మాత్తుగా "చాలు. ఫిడేలు వాయించ"మన్నాడు. ఆ సంగీత విద్వాంసుడు ఫిడేలు తీగలు సవరిస్తుండగానే మీనన్ దాన్ని పక్కన పెట్టమని ఆయన ఊరడిగాడు. బ్రాహ్మడు తన ఊరుపేరు చెప్పగానే 'రైలుఛార్జి ఎంత'ని అడిగాడు. 'పద్నాలుగణాల'ని సమాధానం వచ్చింది. మీనన్ వెంటనే నౌకర్ను పిలిచి 'ఈ బ్రాహ్మడికి పద్నాలుగణాలు ఇవ్వమ'న్నాడు. నౌకరు లోపలికి వెళ్ళి తిరిగివచ్చి చిల్లరలేదని చెప్పాడు. మీనన్ 'ఒక రూపాయి తీసికొని సంగీత విద్వాంసుడి వెంటపోయి, ఆయనకి ఖచ్చితంగా పద్నాలుగణాలు మాత్రమే ఇవ్వ'మని నౌకర్ని ఆజ్ఞాపించాడు. ఆ సంగీత విద్వాంసుడి పాండిత్యాన్ని పద్నాలుగణాలకంటే ఒక్కదమ్మిడి కూడా ఎక్కువ చెయ్యదని అంచనా వేయడంలోనే చందుమీనన్ చమత్కార హృదయం కన్పిస్తుంది.

ఆయన హాస్యం ఒక్కొక్కప్పుడు కొంత సాహసంతో కూడి ఉండేది. చందుమీనన్ విచారించిన మద్దెలవాడి కేసొకటి ఈ విషయంలో సుప్రసిద్ధ మైంది. ఈకేసు ఇలా ప్రసిద్ధం కావడానికి కారణం ఈకేసు స్వభావం కాదు. ఈ కేసును చందుమీనన్ విచారించిన తీరు. ఆయన కాలికట్‌లో సబ్‌జడ్జిగా ఉన్నప్పుడు డేవిడ్స్ అనే ఆయన జిల్లాజడ్జి. ఇద్దరూ పక్కపక్క గదుల్లో కోర్టు తీర్చేవారు. తాను కోర్టు జరిపేటప్పుడు అతి నిశ్శబ్దంగా ఉండాలనీ, కార్యకలాపాలకు ఏ మాత్రమూ అవాంతరం కలగకూడదనీ, ఈ విషయంలో తాను చాలా కఠినంగా ఉంటాడనీ డేవిడ్స్ పేరు పొందాడు. చందుమీనన్ ఆయనకొక గుణపాఠం చెప్పాలని అవకాశంకోసం ఎదురు చూస్తున్నాడు. ఒకరోజు చందుమీనన్ కోర్టుకు ఒక కేసు వచ్చింది. ఒక మద్దెలవాడు తనను ఒక ఉత్సవంలో మద్దెల వాయించడానికై నియో గించుకున్నారనీ, యజమానులు తనకు రెండవ తరగతి మద్దెలవాడికిచ్చే ప్రతిఫలమే ఇచ్చారనీ, తన కన్నిచోట్లా మొదటి తరగతి ప్రతిఫలం వస్తుం దనీ అభియోగం తెచ్చాడు. మీనన్ మెదడు చాల చురుగ్గా పనిచేసింది. వాడికి తీర్పు, డేవిడ్స్‌కు గుణపాఠం ఒకేసారి ఇవ్వాలనుకున్నాడు. కేసు తీసుకొని మామూలు విచారణ ముగించి నిశ్శబ్దంగా ఉన్న కోర్టులో అర్జీ దారుణ్ణి పూర్తి వాద్యప్రదర్శన అప్పుడే అక్కడే ఇవ్వమన్నాడు. మద్దెలవాడి వాద్యనైపుణ్యం డేవిడ్స్ కార్యక్రమానికి భంగం కలిగించింది. 'తీర్పు ఇచ్చే ముందు అతని నేర్పు విషయంలో నన్ను నేను తృప్తిపరచుకోవాలను కున్నాను' అని మీనన్ డేవిడ్స్‌కు సమాధానం చెప్పాడు. ఈ వివరణ విన్న తరువాత హాస్యహృదయుడైన డేవిడ్స్ విరగబడినవ్వుతూ 'నీ వొక అసాధారణమైన న్యాయమూర్తివి' అని చందుమీనన్ ప్రశంసించాడు.

ఈ సంఘటన పూర్తి ప్రాముఖ్యాన్ని తెలుసుకోవాలంటే కొంచెం గాఢంగా ఆలోచించవలసి ఉంటుంది. ఒక కోర్టు గదిలో ఒక కోపిష్ఠి యూరోపియన్ జడ్జీ గంభీరంగా కేసువింటూ చిన్న గుసగుసనిగాని, కొద్ది కదలి కనుగాని సహించని సమయంలో, ఒక అతిమామూలు భారతీయ సబ్‌జడ్జి తేలిగ్గా పక్కగదిలో చెవులు చిల్లులుపడేటట్లు మద్దెల ప్రదర్శన ఏర్పాటు చేశాడు. నిజంగా ఈ దృశ్యం ప్రపంచ న్యాయస్థాన చరిత్రలో కనీ వినీ ఎరుగనిది. దేశం నిస్తబ్దంగా ఉన్నప్పుడు బ్రిటిషు అధికారపు రోజుల్లో ఈ పరిహాసోదంతం జరిగిందని మనం గుర్తుంచుకోవాలి. ఇప్పుడు చందుమీనన్

స్వాతంత్ర్యాన్ని, సాహసాన్ని మనం సరిగ్గా అంచనా వేయవచ్చు. అతనికి వచ్చిన బిరుదులూ, ఉన్నతోద్యోగాలూ సేవక స్వభావంవల్ల వచ్చినవి కావనీ దృఢంగా చెప్పవచ్చు.

ఒకసారి ఒక సంపన్న కుటుంబంలో జరుగుతున్న విందులో, అతిథుల మధ్య ప్రభుత్వోద్యోగుల్లో ఉన్న అవినీతిని గూర్చిన చర్చ వచ్చింది. ఒకా యన ప్రభుత్వోద్యోగులంతా లంచాలు తీసుకుంటారన్నాడు. తలా ఒక విధంగా వ్యాఖ్యానాలు చేయడం మొదలుపెట్టారు. అంతా విన్న చందు మీనన్ అధికారపూర్వక భారీవిగ్రహంతో తటాలున లేచి అరిచాడు. 'ఇక్క డున్న ఈ ఒయ్యారథ్ చందు ఎన్నడూ లంచం తీసుకోలేదు' అని వెంటనే ఏమీ ఎరగనట్లు కూర్చుని వడ్డించిన పదార్థం తినడం ప్రారంభించాడు. భోజనంచేస్తున్న అతిథులందరూ కొన్ని క్షణాలు చకితులయ్యారు. ఏమీ జరగనట్లు చందుమీనన్ పట్టెడు పట్టెడు ముద్దలు తింటూ ఉండడం గమనిం చారు. లిప్తపాటులో హాస్యరసోదయమై నవ్వులు ప్రతిధ్వనించాయి. ఈ జోకును అందరూ ఆనందించేటప్పుడు చిలిపిగా కనుగీటి పెదవులపై వెల యించిన చిరునవ్వుతో చందుమీనన్‌ను ఊహించుకోవచ్చు.

ఆయన తను నిర్మొహమాటస్తుడు కాబట్టి అందరూ అలాగే ఉండాలని కోరుకునేవాడు. ఆయన్ను చూడడానికి వచ్చిన యువకుని కథ ఒకటి ఉంది. వచ్చిన యువకుడు చక్కని దుస్తులు ధరించి వినయవిధేయతలున్న వాడుగా కన్పిస్తున్నాడు. చందుమీనన్‌కు బొత్తిగా అపరిచితుడు. మీనన్ అతణ్ణి ఆహ్వానించి కూర్చోమని అడగ్గానే కూర్చున్నాడు. సామాన్యంగా మర్యాదస్తులైన ఆధునిక యువకులెవరైనా కొంచెం సంకోచిస్తారు. వచ్చిన పని ఏమని చందుమీనన్ ప్రశ్నించాడు. ఆ యువకుడు సూటిగా "నాకు కారెక్టర్ సర్టిఫికేట్ ఇవ్వగల సహృదయతను చూపిస్తారని వచ్చా"నన్నాడు. ఈవిధమైన కోరిక ఒక అపరిచిత వ్యక్తికోరడమనేది దురుసు ప్రవర్తనగా భావించి చందుమీనన్ కోపగించుకోవలసింది. కాని మీనన్ అతనితో మాట్లాడి కావలసిన సమాచారం రాబట్టుకొని సర్టిఫికేట్ ఇచ్చాడు. పరిచయం లేని వ్యక్తికి సర్టిఫికేట్ ఎలా ఇచ్చావని ఒక మిత్రుడు మీనన్‌ను ప్రశ్నించగా 'అతని సూటిగా వ్యవహరించే తీరు, నేను సర్టిఫికేట్ ఇస్తానన్న గాఢ నమ్మకం' కారణమని చందుమీనన్ వివరించాడు.

జడ్జి డేవిడ్స్ రంధ్రాన్వేషణ స్వభావానికి సరిగా బుద్ధిచెప్పాడు. కపట సంగీత విద్వాంసునికి గడ్డిపెట్టాడు. అమాయకుడైన దర్జీకుర్రవాడిపై ఉదారతను చూపించాడు. సూటిగా సర్టిఫికేట్ అడిగిన యువకునిపై సానుభూతి చూపించాడు. చందుమీనన్ నిశ్చితాభిప్రాయాలు, హాస్యప్రియత్వం ఆయన సాహిత్య వ్యాఖ్యల్లో కూడా కన్పిస్తాయి. 'శారద' నవలలో 'వకీళ్ళ క్లబ్' అనే దృశ్యం ఉంది. పెద్ద పెద్ద పేర్లుండి వస్తు సంక్లిష్టతవల్ల పాఠకులను తికమకపెట్టే, అనాసక్తిదాయకాలైన నవలల్ని అక్కడ సమావేశమైన కొందరు వకీళ్ళద్వారా వెక్కిరిస్తాడు. అక్బర్ అనే డచ్‌నవల ఇంగ్లీషు అనువాదానికి కేరళ వర్మవలియకోయిల్ తంపురన్ మలయాళానువాదాన్ని ఆయనెప్పుడూ వెక్కిరిస్తుండేవాడు. బహుశా ఒక గొప్ప చక్రవర్తిని గూర్చి రాస్తున్న పుస్తకానికి గాంభీర్యం కల్గించాలనుకున్నాడేమో కేరళవర్మ తన అనువాదంలో సంస్కృత పదజాలాన్ని ఎక్కువగా వాడాడు. సామాన్యుడు ఆ భాషను అర్థంచేసుకోవడం కష్టం, శ్రమదాయకం. నవలాభాషంటే చందుమీనన్‌కున్న అభిప్రాయానికిది విరుద్ధం. భాష తేలిగ్గా చదివించేదిగాను, వ్యావహారికంగాను ఉండాలని ఆయన భావించాడు. ఆయన కేరళవర్మ పుస్తకాన్ని తెరిచి ఒక స్నేహితునికి చదివి వినిపిస్తూ, మధ్య మధ్య నవ్వుతూ, కృత్రిమమైన అజ్ఞానాన్ని ప్రకటిస్తూ ఈ పదం అర్థమేమిటి అని తరచుగా అడుగుతుండేవాడట. ఈ పుస్తకం ప్రతి ప్రతితోను ఒక సంస్కృత-మలయాళ నిఘంటువును కూడ జతపరచి ఇవ్వాలని ఆయన వ్యాఖ్యానించాడు. కేరళలో అప్పుడు కేరళవర్మ సాహిత్యచక్రవర్తి, మలయాళ రచయితలకు ఆదర్శం అని గుర్తుంచుకోండి. కాని చందుమీనన్ కేరళవర్మ పద్యకృతుల్ని ముఖ్యంగా 'మయూర సందేశా'న్ని చాలా అభిమానించాడు. సాయంకాలాలు ఇంటిదగ్గర విశ్రాంతి తీసికొనేటప్పుడు ఊరికే తన ఆనందం కోసం 'మయూర సందేశం' నుంచి, కేరళవర్మ ఇతర పద్యరచనల నుంచి తన కిష్టమైన భాగాలను చదువుతూండేవాడట. చీకట్లో తడుముకుంటూ ఉంటే అకస్మాత్తుగా ఒక ఫ్లడ్‌లైట్ ఆ ప్రాంతాన్ని కాంతివంతం చేసినట్లుగా కేరళవర్మ పద్యాలను చదువుతూ ఉంటే తన హృదయం వెలుగుతో నిండిపోతుందని ఆయన చెప్పాడు. ఈ సంఘటనలు చందుమీనన్‌కు ఖచ్చితమైన సాహిత్యాభిరుచులున్నాయని, మంచి హాస్యపూరిత హృదయం ఉందని నిరూపిస్తున్నాయి.

దేన్నైనా ఆయన విమర్శించాడు. మంచి నెప్పుడూ ఉదారంగా ప్రశం సించాడు. దృఢనిశ్చయమూ, తగినంత సాహసమూ ఉండడంవల్లనే మీనన్ అలాచేయ గలిగాడు.

ఇదే సమయంలో ఆయన వినయాన్ని కూడా చూడవచ్చు. ఇందు లేఖను పాఠకుల ముందు పెడుతూ పీఠికలో 'నా దేశప్రజలు ఇటువంటి పుస్తకాన్ని ఎట్లా చూస్తారో నాకు తెలియదు. ఇంగ్లీషుతో పరిచయం లేని వాళ్ళకు ఇటువంటి కథలు చదివే అవకాశంలేదు. వాళ్లు ఈ విధమైన సాహిత్యంలో మొదటి అనుభవాన్ని ఆనందిస్తారో లేదో నాకు సందేహమే' అని రాశాడు. 'ఉత్తమమైన నవలాలక్షణాలు అని నేను చెప్పిన కళాత్మక విలువలు ఈ పుస్తకానికున్నాయని నేను చెప్పుకోవడంలేదు. నేను చెప్పుకున్నానని పాఠకులనుకుంటే విచారకరం' అంటాడు. ఆ కాలంలో మలయాళంలో ఏ పుస్తకమూ అమ్ముడుపోనన్ని ప్రతులు 'ఇందులేఖ' అమ్ముడు పోయిందని మనం గుర్తుంచుకోవాలి.

ఈ వినయంలో పిరికితనం, చేతగాని తనాల చిహ్నాలేమీలేవు. ఆయన జూనియర్ గుమస్తాగా ఉన్నప్పుడు తక్కిన గుమస్తాలకంటె చాలముందే తన పనిని పూర్తిచేసుకొని పై అధికారులు ఇళ్ళకు పోయేవరకు మెదల కుండా ఉండి, తర్వాత బల్లమీద దరువువేస్తూ 'కథకళి' పాటలు పాడు తుండేవాడట. ఇంకా పనిపూర్తి గాని నెమ్మదిగా పనిచేసుకునే గుమస్తాలకిది అవరోధంగా ఉండేది. కొంతమంది పనిచేయడానికి తోచక పనిని ఆపివేసే వాళ్లు. మరికొంతమంది అతనితో కలిసిపోయేవాళ్లు. ఎవరూ ఆయనంటే అయి ష్టత చూపలేదు. అందరూ ఈ చైతన్యవంతుడైన చిలిపివాణ్ణి భరించేవాళ్లు. ఆయన సోమరీ, ఆత్మవిశ్వాసంలేనివాడూకాదు. చైతన్యవంతుడూ, ఉత్సాహ వంతుడూ.కథకళి సాహిత్యంతో మీనన్‌కు పరిచయం ఉందని దీన్నిబట్టి మీరు తెలుసుకొని ఉంటారు. ఆయన అభిరుచుల్లో సంస్కృత, మలయాళ, ఆంగ్ల సాహిత్యాలను అధ్యయనం చేయడంకూడా ఒకటి. ఆయన చాలా ఉత్సుకత ఉన్న పాఠకుడు. ఆయనకు కొంతమంది దగ్గరి స్నేహితులుండే వారు. ఆయన వాళ్ల సాన్నిహిత్యాన్ని,వాళ్లు ఆయన సాన్నిహిత్యాన్ని పరస్ప రం ఆనందించేవాళ్లు. ఆయన సంభాషణాచాతుర్యం, పద్యపఠనాశక్తి, మృ దంగవాదనానైపుణ్యం, కథాకథనం మిత్రుల్ని అలరించేవి. ఆయనకు సంస్కృ

తంలో మంచి పాండిత్యం ఉన్నప్పటికీ, ఆ భాషమీద గొప్పగౌరవం ఉన్న ప్పటికీ దాని పరిమితుల్ని ఆయన గుర్తించాడు. ఆయన దృష్టిలో సంస్కృతం గొప్పభాషే. అది మన ప్రాచీన వైభవాన్ని తెలుసుకోవడానికి, ఆలంకారిక, కాల్పనిక భావాల ప్రయోగాన్ని నేర్చుకోవడానికీ మాత్రమే పనికివస్తుందని ఆయన అభిప్రాయపడ్డాడు. ఈనాడు ప్రపంచంలో ఏం జరుగుతుందో తెలుసుకోవాలన్నా, మారుతున్న పరిస్థితుల్లో ప్రయోజనకరమైన జీవితాన్ని గడపాలన్నా ఇంగ్లీషు నేర్చుకోవడం అవసరం అని ఆయన నమ్మాడు.

చందుమీనన్‌కు కథకళి అంటే చాలా యిష్టం. ఆయన ఈకళకు గొప్ప అభిమాని, విమర్శకుడు. ఇరుగుపొరుగు దేవాలయాలను సందర్శించడానికి వచ్చిన కథకళి బృందాలను తన ఇంట్లో ప్రదర్శన లిమ్మని ఆహ్వానించేవాడు. ప్రదర్శనాకాలంలో ఏ సందర్భంలోనైనా సంగీతంకాని, నటన కాని తన ప్రమాణాలకు సరిపోకపోతే వెంటనే అంతటితో ప్రదర్శననాపించి వాళ్ళకివ్వాల్సిన డబ్బిచ్చి పంపివేసేవాడు. ప్రదర్శన నచ్చితే పూర్తిగా చూసి బాగా సన్మానించి పంపేవాడు. కథకళి నాట్యసంప్రదాయంలో మంచి నేర్పున్న 'కుంజుకర్థా' అనే నటుడు ఆయనకు చాలా నచ్చాడు. ఇతని ప్రవర్తన వింతగా ఉండేది. అర్థరహితంగా మాట్లాడేవాడు. ముందు ఏం చేస్తాడో ఊహాతీతంగా ఉండేది. తన వేషధారణలో కలిగించుకోకుండా ఉండడంకోసం గ్రీన్ రూంలో అతని చేతులు కట్టివేయవలసి వచ్చేది. వేషధారణ పూర్తై ప్రేక్షకుల ముందుకు వచ్చింతర్వాత పూర్తిగా మారిపోయేవాడు. ప్రదర్శన మొదలుకావడానికి కొంచెం ముందుగా ఆ ప్రదర్శన ఏమిటో, అతడు ధరించాల్సిన పాత్ర ఏమిటో చెప్పేవాళ్లు. అయినా తన పాత్రను అద్భుతంగాను, సమగ్రంగాను నిర్వహించేవాడు. నటన పరిపూర్ణంగా ఉండేది. చందుమీనన్‌కు "కుంజుకర్థా" అంటే ఎంతో అభిమానం. ఒక సారి కుంజుకర్థా ప్రదర్శన చేస్తూండగా అకస్మాత్తుగా 'ఒక్క నిముషం ఆగ' మన్నాడు. ఆరోజు సావరిన్ విలువెంతో తెలుసుకొని, దానికి సమానమైన వెండి రూపాయల్ని అప్పుడే అక్కడే కుంజుకర్థా దోసిళ్లలో పోశాడు. కుంజుకర్థా ఉన్నత ప్రతిభను ఉదారంగా ప్రశంసించడంలో చందుమీనన్ విశాల హృదయం ఆ వృద్ధ కళాకారుని వింత ప్రవర్తనని లెక్కపెట్టలేదు.

ఆయన మరణించినప్పుడు తమ మధ్యనుండి బహుముఖ ప్రజ్ఞాశాలి, సజ్జనుడూ అయిన ఒక సమున్నత వ్యక్తిని, తమ గౌరవాన్నీ, ప్రేమనూ చూరగొన్న వ్యక్తిని కోల్పోయినట్లుగా లోకం భావించింది.

సంవత్సరాలు గడిచాయి. ఆయన పుస్తకాలు ఆయనకు తెలియని స్నేహితులకు ఆయన్ని పరిచయంచేశాయి. వారి గృహాలలో ఆయనకు స్థానం కల్గించాయి. దూరాన్ని దగ్గరచేశాయి. అపరిచితుణ్ణి స్నేహితుణ్ణి చేశాయి.

"ఈ ప్రపంచపు మహోత్సవానికి నాకు
ఆహ్వానం అందింది, నాజన్మ
తరించింది. నా కళ్ళారా
చాశాను, నా చెవులారా విన్నాను
ఈ ఉత్సవంలో నా వాయిద్యాన్ని
వినిపించడం నావంతు.
నాకు చేతనైనంత నేను చేశాను."

— ఠాగూరు

2

# మలబారులో సమాజ నిర్మాణం

'అగ్ర నిమ్న అంతరాల నాయర్లు, భిన్న స్థాయిల్లోని నంబూద్రీలు, పట్టార్ బ్రాహ్మణులు మొదలైన అనేకరకాల పాత్రల్ని ప్రవేశపెట్టాను.'

(చందుమీనన్ లేఖ నుండి)

చందుమీనన్ కథల్లోని పాత్రల్ని, సన్నివేశాల్ని మలయాళేతరులు ఆనందించాలంటే నాటి మలబారులోని సమాజనిర్మాణాన్నిగూర్చి కొంత తెలుసుకోవలసి ఉంటుంది. అక్కడ అనేక వర్ణాలకు చెందిన జనులున్నారు

మలబారు బ్రాహ్మణులు లేక నంబూద్రీలు, తమిళ బ్రాహ్మణులు లేక పట్టార్లు, తుళు బ్రాహ్మణులు లేక ఎంబ్రాన్లు మొదలైన బ్రాహ్మణశాఖ లుండేవి. బ్రాహ్మణేతరుల్లో నాయర్లు చాల ముఖ్యమైనవారు. వారియర్లు, కానియన్లుకూడా ఉన్నారు. జనాభాలో హైందవేతరుల సంఖ్యకూడా ఎక్కువే. కాని చందుమీనన్ కథలో వీరిపాత్ర చాలా అప్రధానమైంది.

నంబూద్రీలు అగ్రవర్ణంగా పరిగణింపబడేవారు. కేరళను పరశురాముడు నివాసయోగ్యం చేశాడన్న ప్రాచీనమైన కథతో సంబంధం ఉన్న వీరు మొదట వలస వచ్చినవారై ఉంటారు. 19 వ శతాబ్దంలో వీరిలో చాలామంది ధనిక భూస్వాములు. భవిష్యత్తును గూర్చిన చింతలేకుండా సుఖజీవనం గడిపేవాళ్లు. వాళ్లేదైనా వృత్తిని స్వీకరిస్తే అది రాజకుటుంబాలకి ధనిక భూస్వామ్య కుటుంబాలకీ చెందిన దేవాలయాలకూ, ఇతర దేవాలయాలకు పూజారులుగా ఉండడమే. మతం, విద్య, ఆనందం -ఈమూడే వారికి ప్రధాన ఆసక్తులు. 'ఇల్లం'లు అనే వాళ్ళ ఇళ్ళు విద్యకూ, ఆతిథ్యానికీ, వినోదానికీ కేంద్రాలుగా ఉండేవి. ఈ ఇల్లంలు నడిపే పాఠశాలల్లో సంస్కృతం, మతగ్రంథాలు, మతకర్మకాండల్లో ఉచిత విద్యాబోధన, ఊట్టుపురాలు లేక భోజనశాలల్లో ఉచిత భోజనం లభించేవి. వినోదానికి ఒక కథకళి బృందం కాని పథకమ్* నిపుణుడుకాని ఉండేవాడు. కొంతమంది నంబూద్రీలు సంస్కృతంలో గొప్ప విద్వాంసులు. పై విషయాలను విడిచిపెడితే ఇతర విషయాలపై వారి ఆసక్తి బహు తక్కువ. నిరాడంబరతకు మారుపేరుగా ఉండే వీళ్లు, అకారణంచేతనే పరిహాసానికి గురయ్యేవాళ్లు. వారికి మంచి హాస్యసంప్రదాయం ఉండేది. నంబూద్రీలను అగ్రవర్ణంగా గుర్తించడంవల్ల నాయర్లు మొదలైన ఇతర వర్ణాలవాళ్లు వారితో మాట్లాడేటప్పుడు ప్రత్యేకమైన భాష నుపయోగించేవాళ్ళు. వీరితో సంబంధాలుండడాన్ని గౌరవప్రదంగా భావించేవాళ్ళు. ఇందు లేఖ నవలలో సంపన్నపూవల్ల తార్వాడు యజమాని ఇలా అంటాడు 'నంబూద్రిపాద్ తెలివి తక్కువవాడైనా గొప్పవాడు. అతనితో సంబంధం నిజంగా మా కుటుంబానికి గొప్ప గౌరవం'. నంబూద్రీలు ఇతర వర్ణాలనుండి కన్యలను సంతోషంతో భార్యలుగా స్వీకరించేవారు. ఎందుకంటే ఆరోజుల్లో వాళ్ళకు ఈ వివాహాలు ఏ విధమైన బాధ్యతనూ

---

* ఒక విధమైన కథాకథనమ్.

కల్గించేవి కావు. తన వర్గంలో వివాహం చేసుకునే గౌరవం ఒక్క పెద్ద కొడుక్కే ఉండడం మరొక ముఖ్యకారణం. ఇవ్వాళ ఇవన్నీ మారిపోయాయి. భారతదేశంలోను, విదేశాల్లోను నంబూద్రీలు నేడు అనేక వృత్తుల్లో ఉన్నారు. వారి స్త్రీలు (అంతర్జనాలు) కూడా పూర్వంకంటే ఎక్కువ స్వేచ్ఛనీ, గౌరవాన్నీ అనుభవిస్తున్నారు.

శారద నవలలో కొప్పున్నిఅచ్చన్ బారినుంచి తప్పించుకుపోతున్న శంకరన్‌కు ఆహారంపెట్టినతులు ఎంబ్రాన్ బ్రాహ్మణుడు. తులునాడు కర్ణాటకలో ఉంది. వీళ్ళకు దాదాపు నంబూద్రీలకున్న స్థానంఉంది కాని వీళ్లు నంబూద్రీలతో సమానులు కాదనే విషయాన్ని సూరి నంబూద్రిపాద్ వివాహంలోవచ్చే దక్షిణలరేట్లు చెప్తాయి. 'బ్రాహ్మణులందరికీ పావలా చొప్పునా, నంబూద్రీలకు అర్ధరూపాయి చొప్పునా' ఇవ్వాలి. ఎంబ్రాన్లు మలబారుకు వలసవచ్చి పూజారివృత్తిని జీవనాధారంగా చేపట్టారు. పటారకి అవకాశం చాలా అరుదు.

పట్టార్లు తమిళ మండలాలనుంచి వచ్చిన బ్రాహ్మణులు. పట్టార్ శబ్దం సంస్కృత భట్టర్ శబ్దానికి అపభ్రంశరూపం. వాళ్ళలో కొందరు అనేక తరాలనుంచీ కేరళలో నివసిస్తున్నా ఇప్పటికీ ఇంటివద్ద తమిళమే మాట్లాడతారు. వేషధారణకూడా అంతే. ముఖ్యంగా స్త్రీలు తమిళనాడులో లాగానే ఉంటారు. వాళ్లు ఉద్యోగాలద్వారా, వ్యాపారంద్వారా జీవించడానికి వచ్చారు. వడ్డీవ్యాపారులుగాను, వర్తకులుగాను, భూస్వామ్యకుటుంబాలలో మేనేజర్లుగానూ, వంటవాళ్ళుగానూ వృత్తులు స్వీకరించారు. కొంతమంది నాయర్లతో వివాహసంబంధాలు చేసుకున్నారు. వాళ్ళు చాలా ఉత్సాహంతోనూ, ఓపికతోనూ పనిచేస్తారు. అతిగా డబ్బు సంపాదించాలనే కుతూహలంతో వాళ్ళలో కొందరు అక్రమకార్యాలకుదిగి కొంత అప్రతిష్ఠ తెచ్చుకున్నారు. అయినా ఈ వర్గంనుంచి ఎంతోమంది ప్రసిద్ధ పండితులు, సంగీత విద్వాంసులు, న్యాయవాదులు, వైద్యులు, పరిపాలనాధికారులు మొదలైన వారు వచ్చారు.

తిరుమూల్పాదులు క్షత్రియులు. ఈ వర్ణానికి చెందినవాడే రామవర్మ, శారదలో కొప్పున్ని అచ్చన్ ప్రత్యర్థి. మౌలికంగా ఒక స్థాయికి చెందిన జమీందార్లే అయినా రాజులకులాగా ప్రాంతీయ పరిపాలనాధికారాలు వీరికిలేవు.

అయినా ధనవంతులయిన తిరుమూల్పాదుల నివాసాలు మొన్నమొన్నటిదాకా రాజప్రాసాదాలని పిలవబడేవి.

శారద నవలలో కన్పించే శంకరవారియర్ అంబలవాసి వర్ణానికి చెందినవాడు. దేవాలయాల్లో సేవచేయడం వీరివృత్తి. దేవాలయాన్ని శుభ్రంగా ఉంచడం, దేవతలకు పూలమాలలు అల్లడం, పూజారులకు 'సహాయమ్'లుగా ఉండడం వీరిపని. సాధారణంగా వీరు అతి సామాన్యమైన నిరాడంబర జీవులు. చాలామందికి సంస్కృతంలో ప్రవేశం ఉంటుంది. కొంతమంది గొప్ప పండితులూ, ఆరితేరిన జ్యోతిష్యులూ కూడా ఉన్నారు.

మలబారులో నాయర్లకొక ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. సాధారణంగా మలబారును గురించో, కేరళ గురించో విన్నప్పుడు ఎవరైనా నాయర్ల గురించి ఆలోచిస్తారు. వీళ్ళు బ్రాహ్మణేతర హిందువులు. కొంతమంది తెలియక వీళ్లు తమిళ ప్రాంతంలోని శూద్రులవంటివారేననీ, అదే స్థాయివాళ్ళనీ అనుకుంటారు. కాని నిజంగా వీళ్ళు వాళ్ళకంటె వేరు.

వాళ్ళకు ఒక సైనిక సంప్రదాయం ఉండేది. బ్రిటిషు పరిపాలన రాకముందు మలబారులో అనేకమంది జమీందార్లుండేవాళ్లు. వాళ్ళ మధ్య సఖ్యత అతి తక్కువగా ఉండేది. యుద్ధాలు విరివిగా జరుగుతుండేవి. ఆ యుద్ధాల్లో నాయర్లు సైనికులుగా పాల్గొనేవాళ్ళు. జమీందార్లలో చాలా మంది నాయర్లే. వాళ్లు యుద్ధాలు లేనప్పుడు వరిపొలాల్లో ఉండేవాళ్లు. ఈ వృత్తుల వల్ల వారిలో గాఢమైన స్వాతంత్ర్యాభిలాష, అతిశయించిన ఆత్మగౌరవమూ, ఆతిథ్యభావనా ఉండేవి.

బలమైన కేంద్రప్రభుత్వమూ, శాంతియుత వాతావరణమూ నాయర్ల జీవన విధానంలో మార్పులు తెచ్చాయి. చాలామంది తమ కత్తుల్ని నాగలి కర్రలుగానూ, కలాలుగానూ, ఇతర పనిముట్లుగానూ మార్చివేశారు. వీళ్లు పూజారి వృత్తిలో తప్ప తక్కిన అన్ని వృత్తుల్లోనూ ప్రవేశించారు. సాధారణంగా మేధావులూ, ప్రతిభావంతులూ కావడంచేత వాళ్లు ఆయా వృత్తుల్లో ప్రకాశించారు. అయినా వారిలోని స్వేచ్ఛాప్రియత్వం కేరళలో మంచి నాయకత్వం రాకుండా అడ్డు పడిందని చెప్పాలి. అతిశయించిన ఆత్మాభిమానం కొంతవరకు నాయర్ల ఆర్థికాభివృద్ధిని కుంటుపరిచింది. ఇతర ప్రాంతాల్లో

రెడ్డి, సింగ్, ఖాన్‌ల లాగా నాయర్లలో మీనన్, నాయర్, పిళ్లె మొదలైనవి కొన్ని పేర్లు.

నాయర్ల సాంఘిక జీవితంలో ఒక ముఖ్యమైన లక్షణం మరుమక్కత్థాయం పద్ధతి లేక మాతృస్వామిక పద్ధతి. దీన్నిబట్టి నాయర్ల కుటుంబానికి తార్వాడ్ అని పేరు. ఒక పూర్వీకురాలు ఆమె వారసులు కొడుకులూ, కూతుళ్ళూ ఈ ఉమ్మడి కుటుంబంలో ఉంటారు. ఆస్తి హక్కు, వారసత్వం తల్లినుంచి వస్తాయి. అయినా నిజమైన యాజమాన్య హక్కు, బాధ్యత కుటుంబం అంతటికీ పెద్దవాడైన కారణవన్ అనే వాడికే ఉంటుంది. స్త్రీల, వారి సంతానం పోషణకై కారణవన్ ఆస్తిని చట్టబద్ధంగా నిధిగా ఉంచుతాడు. సహజంగా అతను కుటుంబంలోని సభ్యులందరికీ సంరక్షకుడు. తార్వాడ్ ఆస్తి మార్పిడి హక్కు అతనొక్కడిదే కాదు.

కుటుంబంలో చిన్నవాళ్లను అనందరవన్లు అంటారు. వాళ్ళలో పెద్దవాడికి కారణవన్‌గా వారసత్వం లభిస్తుంది. ఆస్తిని ఉపయోగించడంలో గాని, నిర్వహణలోగాని కారణవన్ అక్రమంగా ప్రవర్తిస్తే వీళ్ళు అడ్డుపెట్టవచ్చు. తార్వాడ్ శాశ్వత లాభంకోసం ఆస్తిని భద్రపరిచే హక్కు వీళ్ళకుంటుంది. నిర్వహణ అంటే సాధారణంగా తార్వాడ్‌లో బోలెడంత ఆదాయం ఉన్నప్పటికీ కనీసావసరాలకు మాత్రమే ఖర్చుపెట్టడం. అనందరవన్లను తప్పకుండా చదివించాలనే నియమంకూడా ఏమీలేదు. తరచుగా కారణవన్ మనస్సులో భిన్న ఆసక్తుల సంఘర్షణ ఉంటుంది. తార్వాడ్‌లోని సభ్యుల అవసరాలను తీర్చాల్సిన బాధ్యత అతని కుంది. తన భార్యా పిల్లల అవసరాలను తీర్చాల్సిన బాధ్యతకూడా ఉంది. సామాన్యంగా మరుమక్కత్థాయం తార్వాడ్లలో వచ్చే వివాదం ఏమంటే, ఇతర సభ్యులు కారణవన్ తన భార్యా బిడ్డలకోసం తార్వాడ్‌లోనుంచి పెద్ద మొత్తాలను అక్రమంగా వాడుకున్నాడని భావించడంవల్ల వచ్చే వివాదం. ఒక్కొక్కసారి కారణవన్ కుటుంబ సభ్యుల మధ్య భేదభావాన్ని అవలంబించడంగాని, నిరంకుశవైఖరిని ప్రదర్శించడంగాని తగాదాకు కారణం కావచ్చు. కారణవన్లలో చాలామంది మంచివాళ్లు. చెడ్డవాళ్లలో చాలామంది అన్నివేళలా చెడ్డవాళ్లు కాదు.

కుటుంబంలోని సభ్యులకు జీవిత కనీసావసరాల చింత ఉండదు. సోమర్లకూ, పనిచేసేవాళ్ళకూ కుటుంబాదాయాన్ని అనుభవించే హక్కు

సమానంగానే ఉంటుంది. అందువల్ల పురోగతినీ, సంపన్నతనీ సాధించడానికి కావలసిన ఉత్సాహమూ వ్యక్తుల్లో లోపిస్తాయనే విమర్శకు ఈ వ్యవస్థ గురైంది. స్థిరాదాయంలేని బ్రిటిషు యువకులు బ్రిటిషు సామ్రాజ్యాన్ని నిర్మించారని చెప్తారు కదా! పై వాక్యంలో నిజం ఎంతైనా ఉండనీ, ఇటువంటి కుటుంబ పద్ధతిని గూర్చి నోబెల్ బహుమతి రచయిత్రి పేర్ల్‌బక్ ఇట్లా వ్రాసింది. "కుటుంబం వ్యక్తియొక్క దృఢస్థావరం, అతని రక్షణ, అతని ఆశ్రయం అయి ఉండాలి. ఏ ప్రభుత్వమూ, సంక్షేమ సంస్థా పిల్లలక్కాని, పెద్దలక్కాని అంతకంటే మంచిని చేయలేదు."

తార్వాడ్ నివాసం ఒక చతురస్రాకార భవనాన్ని (నలుకెట్టు), దానికి మధ్య మండపాన్ని (నడుముట్టమ్) కలిగి ఉంటుంది. సంప్రదాయం స్త్రీలకూ, పురుషులకూ, కారణవన్‌కూ భిన్నభాగాలను కేటాయించింది. పాత సంపన్నతార్వాడ్లలో గృహదేవతలకు ప్రత్యేకమైన దేవళాలు, కార్యాలయాలు, ఊట్టుపురాలు (సత్రాలు), ఇంకా కలారీలు (గరిడీలు) ఉంటాయి. ఇందులేఖలో కారణవన్ నివాసంలో రెండు మూడు విశాలమైన రెండంతస్తుల భవనాలూ, ఒక చెఱువూ, స్నానశాలలూ, దేవాలయమూ, బ్రాహ్మణ భోజనశాలలూ మొదలైనవి ఉన్నాయి. శంకరన్ శారద తార్వాడును దర్శించినప్పుడు దాని వైశాల్యాన్నీ, భవంతుల సంఖ్యనూ, వాటి వైవిధ్యాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. చెఱువులో స్వచ్ఛమైన జలం ఉంది. అవతలి గట్టున ఉన్నవాళ్లను గుర్తించడమే కష్టం. అంత పెద్దదా చెఱువు.

స్నానాల చెఱువు చాలా ముఖ్యమైంది. ఎందుకంటే నాయర్లు తమ శరీర శుభ్రత్వానికి చాలా ప్రాధాన్యం ఇస్తారు. స్త్రీ, పురుష, బాల భేదం లేకుండా ప్రతివాళ్ళూ సాధారణంగా రోజు కొకసారైనా తలంటిస్నానం చేస్తారు. రెండువారాల కొకసారైనా అభ్యంగస్నానం చేస్తారు. ఇందులేఖలో చెఱువు ప్రక్కనే ఉన్న స్నానగృహాల ప్రస్తావన అనేకచోట్ల ఉంది. ఈ స్నానగృహాలనుండి చెఱువులోనికి మెట్లుంటాయి. స్త్రీపురుషులకు విడి విడిగా గదులుంటాయి.

ఆ మహత్తర దినాలలో పెద్ద తార్వాడ్లు చైతన్యవంతమైన సామాజిక జీవన కేంద్రాలుగా ఉండేవి. అనేకమంది కుటుంబ సభ్యులూ, వారి బంధువులూ తమ తమ బాధ్యతా నిర్వహణంలో ఎప్పుడూ తిరుగుతుంటారు. ఆడ

మగ నౌకర్లు తమకు అప్పగించిన పనుల్ని చేస్తూ హడావుడిగా అటూ ఇటూ తిరుగుతుంటారు. పూజారి గుడిపనిలో నిమగ్నమై ఉంటాడు. ఎస్టేటు విషయాల్ని కారణవన్‌తో చర్చించడానికి మేనేజరూ న్యాయవాదులూ వస్తూంటారు. కౌలుదార్లు, వ్యవసాయదార్లు తమ సమస్యల్ని చెప్పుకోడానికి వచ్చే వాళ్లు. కూలీలు ఆవరణలో తమ పనులు పూర్తిచేసుకుంటారు. వీధుల్లో తిరిగి అమ్ముకునేవాళ్లు కూరగాయలు, ఇతర వస్తువులు తెస్తుంటారు. మిత్రులు, పరిచయస్తులు మాట్లాడటానికి వస్తుంటారు. అధికప్రసంగులూ, అనాధలూ ఒకపూట భోజనం కోసమో, ఏదో లాభం ఆశించో తార్వాడ్ చుట్టూ ముసురు తుంటారు. ఈ విధంగా నివాసంలో అన్నిభాగాలూ గుడీ, తోట్టుపురాలు, స్నానశాలలూ అన్నీకూడా పనికో, కాలక్షేపానికో చేరిన భిన్నవ్యక్తులతో రణగొణగా ఉంటాయి. "సాయంకాలాల్లో గుడి, చెఱువు, ఆవరణ (పూంచొలక్కార వీదమ్) లలో గుమిగూడిన గుంపుల్ని వర్ణించడం కష్టం." దీనికి తోడు అప్పుడప్పుడూ కథకళి, పథకమ్ లేక ఓట్టమ్ థుల్లాల్ ప్రదర్శనో, లేకపోతే ఏ శాస్త్రిగారి పురాణ కాలక్షేపమో మరింత సంరంభాన్ని కలిగిస్తుంది. 'పూవల్లి తార్వాడులో ఎంతో ప్రాచీన సాహిత్యం' ఉంది ఇందులేఖ తమ ఇంట్లో కొన్ని సంవత్సరాలుగా కథకళి ప్రదర్శనం లేదని చెప్పినప్పుడు సూరి నంబూద్రిపాద్ ఆశ్చర్యపోతాడు. 'నాలుగయిదు సంవత్సరాలా! ఇటువంటి ధనిక గృహంలో నాలుగయిదు సంవత్సరాల్లో నాటకమే లేదా! ఇది నాకు అంతుపట్టకుండా ఉంది' అని తన ఆశ్చర్యాన్ని ప్రకటిస్తాడు.

తార్వాడ్ ఆవరణంలో ఉండే అన్నిభవనాలూ, వాటిలో గడపబడే తార్వాడ్ జీవనమూ తెలిస్తేగాని తార్వాడ్ చిత్రం పూర్తికాదు. ఆవరణంచుట్టూ కంచో, గోడో ఉంటుంది. ఈ ఆవరణం ధనిక కుటుంబాల్లో 2, 3 ఎకరాల వైశాల్యం కలిగి ఉంటుంది. ఇందులోనే కుటుంబదేవాలయం, గృహాలు, పశుశాలలు, చెఱువులు మొదలైన సాంప్రదాయాను గుణమైన స్థలాలలో ధర్మశాస్త్రానుసారంగా (వాస్తుశాస్త్రం) ఉంటాయి. చెఱువులను స్నానానికీ, సేద్యానికీ ఉపయోగిస్తారు. రెండు మూడు మంచినీటి బావులుకూడా ఉంటాయి. వీటిలో ఒకదాన్ని కేవలం గుడికి కేటాయిస్తారు. ప్రధాన గృహానికి తూర్పుగా కొన్ని గజాల దూరంలో పరిశుద్ధమైన తులసివనం ఉంటుంది. ప్రతిరోజూ సంధ్యాసమయంలో కుటుంబ స్త్రీ ఒకరిక్కడ దీపం వెలిగించాలి. ఇంటిముందు తోటలో మల్లె, చేమంతి, జాజి, మందారం మొదలైన పూల

తీగలూ, పొదలూ ఉంటాయి. గుళ్లో దేవుడికి పూజలు చేయడానికీ, స్త్రీలు అలంకరించుకోడానికి చెఱువుల్లోని కలువల్నీ, పద్మాల్నీ ఉపయోగిస్తారు. ఇంటికిరుప్రక్కలా, వెనుకా ఉన్నతోటలో కూరగాయల తీగలూ, చెట్లూ ఉంటాయి. గృహ నిత్యావసరాలకు సరిపోయే కూరగాయలు గుమ్మడి, దోస, బెండ, చిలకడదుంపలు, అల్లం, పసుపు, పచ్చిమిరపకాయలు మొదలైన వాటిని ఈ తోటలో పండిస్తారు. ఆవరణ నిండా మామిడి, పనస, చింత, మునగ, కొబ్బరి, తాడి, అరటి మొదలైన ఫలవృక్షాలూ తమలపాకు లతలూ సమృద్ధిగా ఉంటాయి. అదనులో పళ్ళూ, కాయలూ కోసి కొన్నింటిని అప్పుడే ఉపయోగించేవాళ్లు. కొంత భాగాన్ని ఎండబెట్టి, ఊరగాయలుపెట్టి, అనేక విధాలుగా నిలువచేసేవాళ్లు. కొన్నిసార్లు తార్వాడ్లకు సంబంధించిన వరిపొలాలు తార్వాడ్ఆవరణను అనుకునే ఉంటాయి.

ఈనాడు చాలా తార్వాడ్లు తల్లిదండ్రులు, పిల్లలు మాత్రమే ఉన్న చిన్న కుటుంబాలుగా విడిపోయాయి. నిజమైన తార్వాడ్ ఈనాడు యాత్రికులకు కుతూహలాన్ని రేకెత్తించే దర్శనీయవస్తువుగా మారుతున్నది.

డబ్ల్యు. డూమెర్గ్ తన 'ఇందులేఖ' అనువాదంలో నంబూద్రీలు, నాయర్ల గురించి కొన్ని వివరాలు ఇచ్చాడు.

'శారద 'నవలలో ఇద్దరు ప్రత్యర్థుల్నీ తన భాషణ నైపుణ్యంతో మెప్పించిన చథుపణిక్కర్ కనియన్ పణిక్కర్ కులంవాడు. పూర్వం అస్పృశ్యుల కులానికి చెందిన హిందువు. అతను ఆయుధ శిక్షణ వృత్తిగా గల్గిన కలారి పణిక్కర్ కంటె భిన్నుడు. కనియన్ పణిక్కర్ వృత్తి మలయాళీలలో జ్యోతిషంమీద విస్తారమైన నమ్మకం ఉంది. బహుశా ఇతరుల్లోకూడా ఉండి ఉంటుంది. అందువల్ల కనియన్ మలబారు గృహజీవితంలో ఒక ముఖ్యమైన, ఆసక్తిదాయకమైన పాత్రను నిర్వహిస్తాడు. ఏ కార్యక్రమాన్ని ప్రారంభించడానికైనా,వ్యాపార విషయాల్లో, పెళ్లిళ్లలో, వ్యవసాయంలో,న్యాయవిషయాల్లో, పుట్టువెంట్రుకలు తీయించడంలో ఒకటేమిటి ? ప్రతివిషయంలోనూ కనియన్ సలహాను కోరతారు. కనియన్ శబ్దం గణకన్ (గణికుడు, లెక్కపెట్టేవాడు) అన్న పదంయొక్క అపభ్రంశరూపం అంటారు. కొన్నిసార్లు వాళ్ళ జ్యోతిషం అచ్చంగా వాళ్లు చెప్పినట్లే ఫలించిందని చెప్పాలి. కాని కనియన్లలోకూడా, తక్కిన వృత్తుల్లోలాగానే చథుపణిక్కర్ లాంటి గారడీవాళ్లు ఉన్నారు.

చందుమీనన్ మలబారులో ఇటువంటి భిన్నకులాలవాళ్లు తమ తమ వంశపారంపర్యమైన జీవితాల్ని జీవించారు. కొత్తతరానికి ప్రతినిధి అయిన మాధవన్‌కూడా చెవులకు పోగులూ,నడుముకు పొడుగాటి కుచ్చూ ధరించాడు. వీళ్ళలో కొందరు మంచివాళ్లు, కొందరు దుష్టులు. వైతిపట్టార్ లాంటి మరి కొందరు క్రూరులు. పరిస్థితులు వీరందర్నీ ఒకచోటికి తీసుకునిరాగా వాళ్ళ భిన్నలక్షణాలు వాళ్ళ మాటల ద్వారా, చేతల ద్వారా వ్యక్తమై వాళ్ల స్వభావాన్ని నిరూపిస్తున్నాయి. మలబారు సామాజిక గృహజీవిత చిత్రంలో సహజంగానే వీళ్లు విభిన్న ఆసక్తికరమైన రంగులుగా ఏర్పడ్డారు. చందుమీనన్ నవలలో సంప్రదాయవాదులకూ, ఆధునికులకూ మధ్య సమన్వయం కుదరనప్పుడు ఘర్షణ వస్తుంది. కొన్ని పాతపద్ధతులు కొత్త ప్రమాణాల పరీక్షకు నిలువలేవనీ, కొత్త సవాళ్ళ ఒత్తిడికి పాత ప్రమాణాలు సర్దుకుపోవాలనే సూచన మనకు కనిపిస్తుంది.

తనకాలంలోని మలబారు సామాజిక జీవన విధానాన్ని మార్చే కొన్ని హేతువుల్నీ, ప్రభావాల్నీ చందుమీనన్ తన నవలల్లో చూపించాడు.

3

# మొదటి తరపు మలయాళ నవలలు

మలయాళ భాషలో వచ్చిన మొదటి నవలలసంక్షిప్త సమీక్షలు మలయాళ సాహిత్యరంగంలో ఒక నూతన మార్గాన్ని ఆవిష్కరించినవాడిగా చందుమీనన్‌ను అర్థంచేసుకోవడానికి తోడ్పడతాయి. మలయాళ భాషలో మొదటి నవల 1887 లో వచ్చింది. ఇది అప్పూ నెడుంగడి రచించిన 'కుందలత'. ఆంగ్ల సాహిత్యంతో పరిచయం ఉన్నవారెవరైనా కుందలతలోని కొన్ని సన్నివేశాలు, పాత్రలు షేక్స్పియర్ రచించిన టెంపెస్ట్, సింబలీన్,స్కాట్ రచించినఐవాన్‌హోలలోని కొన్నిసన్నివేశాల్ని,పాత్రల్నిగాఢంగా పోలిఉన్నాయని గుర్తిస్తారు. అయినా 'కుందలత'లో కొంత భారతీయత ఉంది.

ఈ కథలోని ధర్మపురి,కళింగ,కుంతల మొదలైన ప్రాంతనామాలు, తారానాథన్, కపిలనాథన్, కుందలత మొదలైన పాత్రలపేర్లు భారతీయాలు. ఈ ప్రదేశాలెక్కడున్నాయో,ఈసంఘటనలు ఎక్కడ జరిగాయో మనకు తెలియదు. అవి ఎప్పుడో, ఒక కల్పిత ప్రాంతంలో జరిగినట్లు కన్పిస్తుంది. పాత్రలు మలయాళేతరాలు. ప్రదేశంకూడా మలయాళేతరమే. చాలా సంఘటనలు అవాస్తవికాలు. మలయాళీ జీవితానికీ, సంస్కృతికీ సంబంధం లేనివి. భాష మాత్రం మలయాళం. ఈ ఒక్క లక్షణాన్నిబట్టి దీన్ని మొదటి మలయాళ నవలల్లో ఒకటిగా గుర్తించవలసి ఉంటుంది.

తర్వాత 1890 లో 'ఇందులేఖ' వచ్చింది. చందుమీనన్ 'శారద' మొదటి భాగం 1892 లో వచ్చింది. ఈ మధ్యకాలంలో సి. వి. రామన్ పిళ్లె 1891 లో తన ప్రసిద్ధనవల 'మార్తాండ వర్మ'ను మలయాళ సాహిత్యాని కందించాడు. ఇది ఒక చారిత్రాత్మక నవల. రెండు వందల సంవత్సరాల క్రితం తిరువాన్కూరును పాలించిన గొప్ప రాజు వీర మార్తాండవర్మను గూర్చిన కథ ఇది. సహజంగానే సంఘటనలన్నీ కేరళలో జరిగినవే. పాత్రలన్నీ కేరళకు చెందినవే. భాష మలయాళమే. కాని వ్యావహారికం కాదు. చారిత్రాత్మక నవల ఆకర్షణీయంగా ఉంటుంది. ఎందుకంటే కాలంలో ఉన్న వ్యవధానం చూడ్డానికి మరింత సౌందర్యాన్ని కల్పిస్తుంది. 18 వ శతాబ్దం ఉత్తర భాగంలో తిరువాన్కూరులోని ఒక రాజు, జమీందారీ కుటుంబాలు వాళ్ళవిధేయతలు,ద్రోహాలు మొదలైన వాటిని గురించి చెప్పే ఈనవల ఉన్నత ప్రమాణాలకు చెందినది. ఈ నవలా రచయిత రామన్ పిళ్లె జీవిత చరిత్రలను బట్టిచూస్తే ఆయనకు మలయాళ సాహిత్యంపై అపారమైన అధికారం ఉందనీ, రచనా వ్యాసంగమే ఆయన వృత్తి అనీ, మార్తాండవర్మ నవలను రాయడంలో చర్చలకూ, రాయడానికీ, మార్పులుచేయడానికి, మెరుగులు దిద్దడానికీ ఆయనకు కొంతకాలం పట్టిందనీ తెలుస్తుంది. రచయిత వృత్తి. రచనా పరిస్థితులు, ఇతి వృత్తం, భాష మొదలైన అన్ని విషయాల్లోనూ 'మార్తాండవర్మ', 'ఇందులేఖ' కంటె భిన్నమైంది. కొంతమంది విమర్శకులు 'మార్తాండవర్మ' స్కాట్ 'ఐవాన్‌హో' ల మధ్య పోలికలున్నాయన్నారు. ఉదాహరణకు శ్రీ బాలకృష్ణన్‌సి.వి. (రామన్ పిళ్ళై) ఒక స్వంత చారిత్రాత్మక నవలను వ్రాయాలని తలపెట్టి ఉద్దేశపూర్వకంగానో, అనుద్దేశపూర్వకం

గానో ఐవాన్‌హో పద్ధతిలో రచించాడని రాశాడు. ఇటు చందుమీనన్ 'హెన్రియట్టా టెంపుల్' పద్ధతిలో నవల రాయడానికి పూనుకొని ఒక సరి కొత్త సాంఘిక నవలను సృష్టించాడు. ఇట్లా చెప్పడం నవలాకారుడుగా 'రామన్‌పిళ్ళైను' గాని, నవలగా 'మార్తాండవర్మ' ను గాని కించపరచడానికి కాదు. ఆయన ఒక సమర్థుడైన నవలాకారుడు. ఆయన గ్రంథం ఒక గొప్ప నవల. చందుమీనన్‌కూడా ఒక ప్రతిభావంతుడైన నవలాకారుడనీ, 'ఇందు లేఖ' ఒక విశిష్టమైన, పూర్తిగా నూత్నపద్ధతికి చెందిన నవల అనీ చెప్పడమే పై మాటల ఉద్దేశం.

మరొక పాండిత్య స్ఫోరకమైన నవల కేరళ వర్మ వలియ కోయిల్ థంపురన్ రచించిన 'అక్బర్'. ఆయన ఈ నవలను 1880 ప్రాంతంలోనే రచించినట్లు కన్పిస్తుంది. ఇందులో భాషతప్ప మరేమీ కేరళకు సంబంధించింది లేదు. భాషకూడా సామాన్య వ్యవహారంలో ఉన్న మలయాళం కాదు. సంస్కృతపదాలతో నిండి ఉంది. ఈ భాషను అర్థంచేసుకోవడమే కష్టమని అభిప్రాయపడ్డాడు చందుమీనన్. ఇది కొత్త నవలకాదు. కేవలం అనువాదమే. మూలానికి రెండోతరపు అనువాదం. పైగా ఈ 'అక్బర్' నవల మూలం డచ్చిభాషలో ఉంది. అది ఇంగ్లీషులోకి అనువదింపబడింది. ఆ ఇంగ్లీషు అనువాదం మళ్ళీ మళయాళంలోకి అనువదింపబడింది.

'ఇందులేఖ' 1890లో వెలువడిందని ఇంతకు ముందు చెప్పాం. "నేను 1889 జూన్ 11 వ తేదీన ఈ పుస్తకం రాయడం ప్రారంభించి ఆగష్టు 17 వ తేదీన పూర్తిచేశా" నని చందుమీనన్ చెప్పుకున్నాడు. ముద్రణ ప్రచురణల విషయంలో నిర్ణయాలు తీసికోవడంలోనూ, ముద్రణలోనూ కొంతకాలం పట్టిఉంటుంది. "ఈ పుస్తకం మొదటి ప్రచురణ ప్రతులన్నీ 1890 జనవరి ప్రారంభంలో అమ్మకం ప్రారంభమై మార్చి 30 వ తేదీ నాటికి పూర్తిగా చెల్లిపోయా"యని 'ఇందులేఖ' రెండవ ప్రచురణ పీఠికలో చందుమీనన్ వ్రాశాడు. ఈనాడు కూడా ఒక మళయాళ నవలకు ఇంత ప్రచారం ఉండడం అసాధారణమైందే. ఇక ఆ రోజుల్లో ఇది అద్భుతమనే చెప్పాలి. ఆ రోజుల్లో ఈ నవల పూర్తిగా కొత్త. కొందరు విమర్శకులు ఇవ్వాళ కూడా మళయాళ సాహిత్యంలో 'ఇందులేఖ' విశిష్టమైందిగా అభిప్రాయపడుతున్నారు.

ఒక తిరువాన్కూరు మహారాజు 'అక్బర్' ఇంగ్లీషు అనువాదాన్ని చదివి అది మలయాళీలకు అందుబాటులో ఉండాలని భావించి కేరళవర్మ వలియకోయిల్ థంపురన్ను దాన్ని మలయాళంలోకి అనువదించమని కోరడంవల్ల 'అక్బర్' మలయాళానువాదం జరిగింది. 'ఇందులేఖ' పుట్టుక భిన్నమైంది. 'ఇందులేఖ'ను రచించడానికిగల కారణాలను చందుమీననే చెప్పాడు. నిజానికి ఆయన ప్రారంభించింది మరొక పుస్తకం. ఆయన ఇంగ్లీషు నవలలను చదవడం ప్రారంభించినప్పుడు ఇంగ్లీషు తెలియని ఆయన మిత్రులు కొందరు ఆయన మంచి కథకుడు కావడంవల్ల ఆ కథల్ని ఆయన ద్వారా వినాలని అభిలషించేవాళ్ళు. ఎర్ల్ బీకన్స్ఫీల్డ్ రచించిన 'హెన్రియట్టా టెంపుల్' నవల చందుమీనన్ మిత్రులలో ఒకరిని గాఢంగా ఆకర్షించింది. ఆ కథను మలయాళంలోకి అనువదించడానికి ఆయన చందుమీనన్ను ఒప్పించాడు. చందుమీనన్ ప్రారంభించాడు. కాని కొంత ముందుకుసాగిం తర్వాత ఆయనకా రచనలో ఆసక్తి పోయింది. కేవలానువాదం ఆసక్తిదాయకంగా ఉండదనీ, జీవరహితంగా ఉంటుందనీ ఒక అభిప్రాయం ఆయనలో చోటుచేసుకుంది. సంజ్ఞలు, పక్కదాట్లు, స్వరంలో మార్పులు మొదలైన వాటితో ఆయన మౌఖిక కథానానికి జీవంపోసేవాడు. అనువాదం అట్లా ఉండదని ఆయన కనిపించింది. పైగా ఇంగ్లీషు నవలలోని ప్రణయసన్నివేశాలు అంత అందంగా మలయాళంలోకి అనువదించడం సాధ్యంకాదని కనుక్కున్నాడు. ఆయన అనువాదాన్ని ఆపివేశాడు. కాని ఆయన్ను రాయమని బలవంతంచేసే ప్రియ వ్యక్తిమాత్రం వదల్లేదు. ఆయన 'ఆమెకోసం కొంచె మించుమించుగా ఇంగ్లీషు నవలల పద్ధతిలో ఒక మలయాళనవలను రాస్తా' నని ఆమె (శ్రీమతి చందుమీనన్)కు మాట ఇచ్చాడు. ఈ మాట ఇవ్వడం 1889 జనవరిలోనే జరిగినా ఎడతెగని ఒత్తిడివల్ల లొంగక తప్పని పరిస్థితి ఏర్పడేవరకూ వాయిదావేస్తూవచ్చాడు. ఇక ఒకరోజు 1889 జూన్ 11వ తేదీన రాయడం ప్రారంభించాడు. తొమ్మిది వారాల్లో 'ఇందులేఖ' పుస్తకంగా రూపొందింది. చందుమీనన్కు న్యాయం చేకూర్చాలంటే ఒక విషయం చెప్పవలసి ఉంటుంది. రచన ఆయన వృత్తికాదు. అందులో ఆయనకు అనుభవమూలేదు. ప్రతిరోజు ఉద్యోగనిర్వహణ చేస్తూనే మిగిలిన సమయంలో ఆయన తన మొదటి నవలను రచించాడు. పైగా మిత్రులతో చర్చించడానికి గాని, మెరుగులు దిద్దడానికి గాని ఆయనకు సమయం లేకపోయింది. తనకు

తెలిసిన, తాను రోజూచూస్తున్న వ్యక్తుల గురించీ, తామూవాళ్ళూ సాధారణంగా మాట్లాడుకునే భాషలోనే చందుమీనన్ అతివేగంగా రచన చేశాడు. పాఠకులు ఆయన సహజ నిరాడంబర శైలికీ, పాత్రలతో గల సాన్నిహిత్యానికీ అద్భుతం చెందుతారు. ఆ పాత్రలు వందల సంవత్సరాల కిందటివికావు. పాఠకులు నిత్యమూ చూస్తున్నవే. వాటిక్కానీ, రచయితక్కానీ పాఠకుల నుండి దాచుకోవాల్సిన రహస్యాలేమీలేవు. 'మార్తాండవర్మ' 'అక్బర్' లలో పాతవ్యవస్థను ఆమోదించే సూచనలను మనం గమనించవచ్చు. రాజులు, జమీందార్ల సంపదలను, కీర్తిని, జీవితాలను రక్షించడానికి కావలసిన విధేయత, త్యాగనిరతులపై మార్తాండవర్మ కాంతిని ప్రసరిస్తుంది. ప్రాచీన వ్యవస్థలో అవాంఛనీయమైన లక్షణాలపై తిరుగుబాటుశక్తులు చందుమీనన్ రచనల్లో కన్పిస్తాయి. ముఖ్యంగా మరుమక్కత్తాయం తార్వాడ్ల అభివృద్ధికీ, స్థిరత్వానికీ భంగం కలిగించేశక్తులు కన్పిస్తాయి.

ఈ కార్యాన్ని చందుమీనన్ కావాలని చేశాడో లేదో మనం ఖచ్చితంగా చెప్పలేంకాని, ఆయన ఏ లక్ష్యాలతో రచన చేశాడో 'ఇందులేఖ' ప్రతితో ఆయన విలియం దూమెర్గ్‌కు1 రాసిన లేఖనుబట్టి సరిగా చెప్పవచ్చు. మొదటిది అటువంటి నవలను చదవాలనే ఖార్యకోరికను తీర్చడం. "అంగ్ల భాషతో పరిచయంలేని నా మలయాళీ పాఠకులలో, అంగ్లంలోని నవలలనే ప్రక్రియలో, ప్రస్తుతం వాళ్ళకు తెలియనిదానిలో (ప్రస్తుత మలయాళ కల్పనా సాహిత్యంలో విదేశీ స్వభావం కల్గిన సంఘటనలను, సన్నివేశాలను, సాధారణంగా అర్థరహితమూ,అసంభవమూ అయిన వాటిని చదివి ఆనందించడానికి అలవాటుపడ్డవాళ్ళకు) నేను అభిరుచిని కలిగింపగలనా అని తెలుసుకోవడానికీ, ఒకానొక పరిస్థితిలో తమ ఇళ్ళలో జరిగే సన్నివేశాలూ, సత్యాలూ ఉన్న కథను ఆస్వాదించగలరా అని చూడడానికీ, మంచి అంగ్ల విద్యావకాశం కల్పించినట్లయితే తమ సహజమైన తెలివితేటలకీ, అందానికీ ప్రసిద్ధులైన మన నాయర్ మహిళలు సమాజంలో ఎంతటి స్థానాన్ని, అధికారాన్ని, పలుకుబడిని సంపాదించగలరో నా మలయాళ సోదరులకు చూపించడానికీ, చివరగా, ఉపయోగించకపోవడంవల్లా, ఉపయోగించినా తప్పుగా ఉపయోగించడంవల్లా ఏదైతే నశించిపోతూందని నేను గమనిస్తు

1. పే. xvi.

న్నానో ఆ మలయాళ సాహిత్యాభివృద్ధికి నా చిన్నికానుకను అందించాలనీ'' తాను భావించినట్లు చెప్పాడు.

దూమెర్గ్‌కు రాస్తున్న లేఖలో చివరి వాక్యంలో ఇట్లా చెప్పాడు· ''దీన్ని (ఇందులేఖను) రాయడంలో నాదేశ స్త్రీల సామాజికస్థాయినీ, స్థితినీ మెరుగుపరచాలన్న ఒకేకోరిక నన్ను పురికొల్పింది''.

ఆయన ఈ కథా రచనాకాలంలో చాలా నిరుత్సాహ పూరితమైన వ్యాఖ్యానాలను ఎదుర్కోవలసి వచ్చింది.''నీవు గనుక ఒక పుస్తకం రాస్తుంటే విజ్ఞానశాస్త్రరంగానికి సంబంధించిన విషయాన్ని తీసుకో. మలబారులో మా కింకొకటి అవసరంలేదు'' అని సలహా ఇచ్చాడో మిత్రుడు. మరొకాయన కథను సంక్షిప్తంగా విని సన్నివేశాలన్నీ ఊహాజనితాలేకాని సత్యాలుకావు కాబట్టి ఇది నిష్ప్రయోజనం అన్నాడు. కథలోని సంఘటనలన్నీ ఒక మలయాళీ కుటుంబపు సాధారణ జీవితంలో జరిగేవే కాబట్టి ఈ కథ పాఠకు డిలో ఆసక్తినిరేకెత్తించలేదని ఇతరులు అభిప్రాయపడ్డారు. ఇటువంటివ్యాఖ్యానా లెన్నివచ్చినా సహజమైన విషయాలున్నా, అద్భుతమైన విషయాలున్నా, సంఘటనలు సాధారణాలైనా అసాధారణాలైనా కథను సరిగ్గా నిర్మించినట్లైతే తప్పక ప్రజాదరణను పొందుతుందని చందుమీనన్ గాఢంగా విశ్వసించాడు. ఆయన సరైన నిర్మాణశిల్పంమీద దృష్టిని కేంద్రీకరించాడు. కనీసం 'ఇందు లేఖ' కు సంబంధించినంతవరకైనా ఆయన అభిప్రాయాలు సరైనవే. ఈ పుస్తకం అశేష ప్రజాదరణను పొందడమేకాక పాఠకలోకంలో గొప్ప సంచలనాన్ని కలిగించింది. మొదటి ప్రచురణ మూడు నెలలలోపునే అమ్ముడుపోయింది. 1890, 1956 మధ్యకాలంలో 53 ప్రచురణలు వచ్చాయి.

'ఇందులేఖ' మొదటి ప్రచురణ జరిగిన రెండు సంవత్సరాలకు 1892లో చందుమీనన్ రెండవ నవల 'శారద' మొదటిభాగం ప్రచురిత మైంది. ఈ రెండు సంవత్సరాల్లో 'శారద' లాంటి నవలను రాయడానికి విషయాలను సేకరించి సిద్ధంచేసుకున్నాడు. మరుమక్కత్థాయం తార్వాడులో వ్యక్తిగా గుర్తింపును, అంగీకారాన్ని పొందడానికి ఒకవ్యక్తి హక్కులకు సంబంధించిన లావాదేవీలు, ఆ వ్యక్తి అర్హతలు ఈ కథావస్తువు. మధ్య ఉన్న ఈ రెండు సంవత్సరాలకాలంలో ఒక బాధ్యతాయుతుడైన న్యాయా ధికారిగా మరింత అనుభవాన్ని గడించాడు. మలబారు వివాహ సంఘ

సభ్యుడిగా ఆయన కృషి మరీముఖ్యమైంది. ఈ సందర్భంగా మలబారులోని అనేక కుటుంబాల చరిత్రలలోని ఎన్నో వివరాలతో ఆయన పరిచయం చేసుకోగల్గాడు. వివిధ గృహ సంబంధమైన ఏర్పాట్లు, భిన్నసభ్యుల ఆసక్తులు, భేదాలను తగాదాలుగా మార్చే వారూ, సంక్లిష్టమూ, సుదీర్ఘమూ అయిన తగాదాలు సర్వనాశనానికో, పునరుద్ధరణకో కారణం కావడం మొదలైన విషయాలన్నీ గమనించాడు. ఈ సంఘం విచారణలలో తను రాయాలనుకున్న నవలకు చక్కగా సరిపోయే విభిన్న సంఘటనలూ, పాత్రలూ ఆయన కెదురయ్యాయి. 1889 జూన్ నుండి ఆగస్టుదాకా న్యాయ స్థానాల్లో తనపని ముగిసిం తర్వాత మిగిలిన కాలంలో 'ఇందులేఖ' రాశాడు. 1889 జనవరిలో తన ప్రియమైన వ్యక్తికి ఒక నవల రాస్తానని మాట ఇచ్చిన దగ్గరినుండి, జూన్ 11 న నిజంగా రాయడం మొదలుపెట్టేవరకూ ఆయన దాన్ని రాయడానికి ఏర్పాట్లు చేసుకుంటున్నాడని అనుకోవచ్చు. 'ఇందులేఖ' రెండవ ప్రచురణ పీఠికలో "జూన్ కంటే ముందే నేనీపుస్తకం లోని కథను గురించి ఆలోచించడం మొదలుపెట్టాను. అప్పుడప్పుడు అవసర మైనప్పుడల్లా నోట్సు తయారుచేసుకుని ఉంచుకున్నాను" అని చెప్పాడు. ఆయన అధికారబాధ్యతా నిర్వహణ సమయంలో కూడా ఇది జరిగింది. అట్లాగే 1890, 1892ల మధ్య తన మొదటి నవల పొందిన ప్రచారానికి సంతోషాన్నీ, ఆత్మవిశ్వాసాన్ని పొంది ఆయన న్యాయస్థానంలో అభియో గాలు విచారించేటప్పుడూ, వివాహసంఘం పనిలో అనేక తార్వాడ్ల సభ్యుల వద్ద వివరాలు సేకరించేటప్పుడూ 'శారద' కోసం అనేక విషయాల్నికూర్చి పెట్టుకున్నాడు. సంఘం నివేదిక ప్రచురితమైన ఒక సంవత్సరానికి 1892లో ఆయన 'శారద' మొదటిభాగాన్ని మనకందించాడు. 1892 ఆగష్టు 19వ తేదీతో ఉన్న ఈ పుస్తక పీఠికలో ఆయన చెప్పిందంతా "మలయాళభాషలో రోజురోజుకూ నవలలు పెరుగుతున్న ఈ రోజుల్లో ఈ పద్ధతికిచెందిన రెండో పుస్తకాన్ని రాసి ప్రచురిస్తూ నేను ప్రత్యేకంగా చెప్పవలసిందేమీ లేదు" అని మాత్రమే.

ఈ పీఠిక అంతా 20 పంక్తులు కంటే తక్కువే. 'ఇందులేఖ' ఆయన మొదటి నవలేకాక, అసలు అటువంటి నవలల్లోనే మొదటిది కావడంవల్ల దాని పీఠిక అయిదుపేజీలు పట్టింది. అటువంటి నవలను రాయడానికి దారి తీసిన పరిస్థితులను పాఠకులకు వివరించడం అవసరమనుకున్నాడు. కొంత

మంది మిత్రుల బలవంతంవల్ల మొదటిభాగాన్ని ముందుగా ప్రచురిస్తున్నానని, రెండు, మూడు భాగాలు సంవత్సరాంతానికి ముందే వస్తాయని మాత్రమే 'శారద' గురించి చెప్పాడు. కాని మృత్యువు ఆయన్ని ముందుగానే తీసు కెళ్ళింది. న్యాయశాఖకూ, మలయాళసాహిత్యానికీ ఇది గొప్ప నష్టం. మలయాళ సాహిత్యానికిది తీరని నష్టం.

# 4

## ఇందులేఖ

'మానవాళి ప్రేమికుణ్ణి ప్రేమిస్తుంది'—ఎమర్సన్.

ప్రేమికులు కొంతకాలం విడిపోయి, దుఃఖం అనుభవించి, చివర మళ్లీ కలుసుకొని ఆనందించే ప్రేమకథ 'ఇందులేఖ'. సంక్షిప్తంగా కథా సారాంశం ఇది.

డూమెర్గ్ కోసం చందుమీనన్ స్వంతంగా ఒక కథా సారాంశాన్ని తయారుచేశాడు. ఈ సారాంశంలో డూమెర్గ్ (ఇంకా ఇతర పాఠకులు) కథలో ప్రధాన విషయాలుగా గుర్తించాలని ఆశించిన విషయాలను నొక్కిచెప్పడం జరిగింది. వీన్ని కింద ఇస్తున్నాం:—

"కథానాయకుడైన మాధవన్‌కూ, అతని బంధువులకూ (ఒక నాయర్ తార్వాడ్‌లోని సభ్యులంతా) మధ్య జరిగిన సంభాషణతో నా కథ ప్రారంభం కావడం గమనించవచ్చు. తార్వాడ్ కుటుంబంలో ఒక యువకుడి విద్యా భ్యాస సంబంధంగా మాధవన్‌కూ అతని కారణవన్ లేక కుటుంబయజమానికీ మధ్య జరిగిన పోట్లాట గురించిన సంభాషణ ఇది. ఈ సంఘటనలు ఈ కాలంలోనే దక్షిణ మలబారులోని ఒక ప్రాంతంలో జరిగినట్లు భావించాలి. ప్రధాన సంఘటనలు జరిగిన సలం కొచ్చిన్‌కు ఎంతోదూరంలో లేదు.

ఈ క్రిందివి నవలలోని ప్రధాన పాత్రలు:

| | | |
|---|---|---|
| 1. పంచుమీనన | — | కారణవన్ లేక చంభాజిమోత్ పూవల్లి కుటుంబ పెద్ద |
| 2. శంకర మీనన్ | — | పంచుమీనన్ తమ్ముడు |
| 3. పార్వతి అమ్మ | — | పంచుమీనన్ చెల్లెలి కుమార్తె |
| 4. మాధవన్, బి. ఏ., బి. ఎల్. | — | పార్వతి అమ్మ కుమారుడు |
| 5. కుమ్మిని అమ్మ | — | పంచుమీనన్ అమ్మమ్మ సోదరి మనుమరాలు |
| 6. చాథర్ మీనన్ | — | కుమ్మిని అమ్మ కుమారుడు |
| 7. గోపాలన్ | | ,, |
| 8. కల్యాణి కుట్టి | — | ,, కుమార్తె |
| 9. షిన్నన్ | — | ,, కుమారుడు (9, 10 (సం॥ ల బాలుడు) |
| 10. కున్హి కుట్టి అమ్మ | — | పంచుమీనన్ భార్య |
| 11. లక్ష్మి కుట్టి అమ్మ | — | ,, కుమార్తె |
| 12. గోవింద కుట్టి మీనన్ | — | ,, కుమారుడు |
| 13. ఇందులేఖ | — | లక్ష్మి కుట్టి అమ్మ కుమార్తె, పంచుమీనన్ మనుమరాలు |
| 14. కేశవన్ నంబూద్రి | — | లక్ష్మికుట్టిఅమ్మ రెండవ భర్త. ఈమె మొదటి భర్త కిలమనూర్ రాజా మరణించాడు. కేశవన్ నంబూద్రి ఇందులేఖ తండ్రి |
| 15 గోవింద పణిక్కర్ | — | మాధవన్ తండ్రి |

పైన చెప్పినట్లుగా మొదటి అధ్యాయం చాథర్ మీనన్ మాధవన్‌ల మధ్య సంభాషణతో మొదలౌతుంది. చాథర్ మీనన్ ఇంగ్లీషు చదువుకోక పోయినా మంచి తెలివి, ఉచితజ్ఞతా ఉన్న యువకుడు. మాధవన్ తన స్వంత తమ్ముడి పక్షానే వాదిస్తున్నా మాధవన్ కారణవన్‌ను అన్నమాటల్ని ఆమోదించలేదు. తగాదాకు కారణం ఇది:—

కారణవన్ పంచుమీనన్ బాలుడు షిన్నన్‌ను చదివించాలని మాధవన్ కోరాడు. కాని సంకుచిత మనస్తత్వం కలిగిన డెబ్భై యేళ్ల వృద్ధు

పంచుమీనన్ మాధవన్ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. పిల్లవాడి స్కూలు ఖర్చులు భరించడానికి నిరాకరించాడు. దీనిపై ముసలి కారణవన్‌కూ, యువ పట్టభద్రుడికీ మధ్య మాటామాటా పెరిగింది. మాధవన్ తనకు అనవసర మైన విషయాలలో జోక్యం చేసుకుంటున్నాడని కారణవన్ అమితాగ్రహం చెందాడు. మాధవన్ కూడా పంచుమీనన్ ప్రవర్తనతో విసుగుచెందాడు. నిజాయితీపరుడూ, ధైర్యశాలీ అయిన ఈ యువకుడు దగ్గరి బంధువులపై కారణవన్‌కున్న పక్షపాతాన్ని గర్హించాడు. మాధవన్ లాగే షిన్నన్‌కూడా దగ్గరి బంధువైనట్లయితే అతని విద్యాభ్యాసానికి పంచుమీనన్ ఎంత డబ్బైనా ఖర్చుపెట్టేవాడు. కాని ఈ పిల్లవాడు (వాస్తవానికి అతనికీ, మాధవన్‌కు గాని మరే ఇతర తార్వాడ్ సభ్యునికిగాని తార్వాడ్ డబ్బుతో చదువుకోడానికి ఎంత హక్కుఉందో అంత హక్కు ఉంది) పంచుమీనన్‌కు దూరపు బంధువు. సాధారణంగా మలబారు తార్వాడ్లలో ముసలివాళ్ళూ, మూఢులూ, నిరంకుశులూ అయిన కారణవన్లు తమ దగ్గరి బంధువులను మాత్రమే చదివిస్తారు. దూరపు చుట్టాలను వ్యవసాయదారులుగాను, తార్వాడ్లలో నౌకర్లుగాను పెంచుతారు. ఉన్నత భావాలు కలిగిన నిజాయితీపరుడైన మాధవన్ ఇటువంటి ప్రవర్తనను అతి గర్హణీయంగాను, లజ్జాకరంగానూ భావించి ఈ విషయంపై తార్వాడ్‌లో కారణవన్‌కున్న ఉన్నతస్థానానికి ఏవిధమైన గౌరవమూ చూపించకుండా చాలాగట్టిగా మాట్లాడాడు. ఇదే విషయంపై మాధవన్ తన చిన్నాన్న శంకరమీనన్‌తోనూ, తల్లి పార్వతమ్మతోనూ సంభాషించడంతో ఈ అధ్యాయం ముగుస్తుంది. ఈ అధ్యాయంలో మాధవన్ సౌందర్యమూ, తెలివితేటల గూర్చిన వర్ణన విస్తారంగా ఉంది.

మాధవన్ ఆర్ట్సులోనూ, న్యాయశాస్త్రంలోనూ పట్టభద్రుడు. అతి సుందరుడు, అసాధారణ ప్రతిభాశాలి, సంస్కృతంలో మంచి పండితుడు. క్రికెట్, లాన్ టెన్నిస్ మొదలైన ఇంగ్లీషు ఆటల్లో మంచి నేర్పరి.

రెండో అధ్యాయాన్ని నాయికకు కేటాయించాడు. ఈ అధ్యాయం సాధారణమైన స్త్రీ సౌందర్యాన్నిగూర్చిన పరిశీలనతో ప్రారంభమై ఇందులేఖ సౌందర్యాన్ని, తెలివితేటల్ని, విద్యనూ, మర్యాదల్ని, వస్త్రధారణనీ వర్ణిస్తుంది. చివరగా మాధవన్, ఇందులేఖల వివాహం ఎలా నిశ్చయమౌతుందో చెప్తుంది.

నాకథ వాళ్లవివాహం నిశ్చయమైన కొన్నినెలల తర్వాత జరిగిన సంగతులతో మొదలౌతుందని గుర్తించుకోవాలి. కాని రెండో అధ్యాయంలో మనకథ మొదలుకాకముందు మాధవన్, ఇందులేఖల కలయికకు సంబంధించిన కొన్ని సంఘటనలను చెప్పాను. ముందే చెప్పినట్లుగా ఇంగ్లీషు నవలల పద్ధతిలో రాయడం నాలక్ష్యం. దీన్నిబట్టి సాధారణ మలయాళ స్త్రీ ఈకథలో నాయికపాత్ర ధరించలేదని గ్రహించవచ్చు. కాబట్టి నా ఇందులేఖ సాధారణ మలయాళ స్త్రీకాదు. ఆమెకు ఇంగ్లీషు, సంస్కృతం, సంగీతం మొదలైనవి తెలుసు. అసమాన సౌందర్యంతో, మనకథ మొదలయ్యే నాటికి పదిహేడేళ్ల పరిపూర్ణయువతి. మలబారులో ఇందులేఖవంటి తెలివి తేటలున్న నాయరు యువతి ఉండడం అసంభవమని నాపాఠకుల్లో కొందరు అభ్యంతరం చెప్పవచ్చు. ఈ అభ్యంతరం చెప్పేవాళ్లు ఇవ్వాళ మలబారులో ఉన్న విద్యావతులైన స్త్రీలతో పరిచయం లేనివాళ్లని నాసమాధానం. ఒక్క ఆంగ్లభాషాపరిజ్ఞానంతప్ప మేధస్సులో, ఉదాత్తమైన నడవడిలో, లోకజ్ఞానంలో ఇందులేఖతో పోల్చదగిన నాయర్ స్త్రీలు ఒకరిద్దరు నాకు స్వయంగా తెలుసు. ఇక అందం, ఆకర్షణ, మంచి అలవాట్లు, ఉత్తమ అభిరుచులు, సంభాషణాచాతుర్యం, సమయస్ఫూర్తుల విషయం వస్తే గౌరవనీయమైన నాయర్ తార్వాడ్లలో నాఇందులేఖ ప్రమాణాలకు సరిపోయే వందలాది యువతులను నిస్సందేహంగా చూపించగలను.

పాఠకులు మన్నించాల్సిన విషయం ఏమంటే అది ఇందులేఖ ఆంగ్ల భాషా పరిజ్ఞానం. జీవితభాగస్వామిని ఎన్నుకోవడంలాంటి అత్యంత ఆసక్తిదాయకమైన విషయాలలో సహజంగానే సౌందర్యవతీ, మేధస్వీ, సంస్కారమూ ఉన్న మలయాళయువతి ఇంగ్లీషుభాషా పరిజ్ఞానండుంటే ఎలా ప్రవర్తిస్తుందో తెలియజెప్పడం ఈ పుస్తకం రాయడంలో నాలక్ష్యాలలో ఒకటి. ప్రపంచ భాషల్లో అతిసంపన్న భాష అయిన ఆంగ్లభాషాపరిచయం నాఇందులేఖ కుండడం అవసరమని నేను భావించాను.

ఎటువంటి పరిస్థితుల్లో ఇందులేఖ ఆంగ్లభాషా పరిజ్ఞానాన్ని సంపాదించిందో, ఇతర విజయాలను సాధించిందో చెప్పాను. ఆమె విద్యలో అసంభావ్యత ఏమైనా ఉందేమో పాఠకులే నిర్ణయించాలి.

ఇక ఈ అధ్యాయంలో మాధవన్ ప్రేమ, స్నేహాన్ని పెంచుకొనే కథను తీసుకుంటే ప్రేమికుల సంభాషణల్లోకాని, ప్రవర్తనలోకాని నాయర్ల

లోని విద్యాధికవర్గంలోని స్త్రీపురుషుల ప్రవర్తనావిధానంకంటే ఏమాత్రం భిన్నంగా లేదని నాఅభిప్రాయం. మలబారులో ఇందులేఖలాగా తమప్రియులతో మాట్లాడే స్త్రీలెందరో ఉన్నారు. నిశ్చయం జరిగిన పద్ధతిలోకూడా ఏమీ ఆశ్చర్యకరమైనదికాని, అసాధారణమైనదికాని లేదనుకుంటాను. గౌరవనీయమైన తార్వాడ్లకుచెందిన విద్యావంతురాండ్రూ, జీవితంలో ఉన్నత స్థానాన్ని సంపాదించిన నాయర్‌స్త్రీలు తమ తల్లిదండ్రుల కారణవన్ల అభిమతానికి పూర్తి విరుద్ధంగా కేవలం ప్రేమకోసం వివాహాలు చేసుకున్నవాళ్ళు నాకెంతోమంది తెలుసు. ఇంగ్లండులోనైనా ఇండియాలోనైనా ప్రేమ ఒక్కటే. వివాహవిషయంలో మలబారు స్త్రీలు ఇంచుమించుగా పెద్దల అధికారానికి లోబడిఉన్నమాట వాస్తవమే. అయినా నాఅభిప్రాయంలో ఒకవర్గంగా భారతదేశంలో ఏయితర స్త్రీలకుకూడా తమ భర్తలను ఎన్నుకోవడంలో మలబారు యువతులకున్నంత స్వేచ్ఛలేదు. పాశ్చాత్యనాగరికతా ప్రభావం వ్యాపించకముందే అనేకమంది నాయర్ వనితలు సంస్కృతం చదువుకున్నవాళ్ళూ, సంస్కృతంలో కవిత్వం చెప్పగలిగినవాళ్ళూ, సంగీత విద్వాంసురాళ్ళూ ఉండేవాళ్లు. ఇరవైయేళ్ళతర్వాత కేవలం స్వచ్ఛమైన మధురప్రేమకోసమే తమ భర్తల్ని ఎన్నుకోగలిగిన వందలాది ఇందులేఖలు మలబారులో మనకు కన్పిస్తారు. మాధవన్ ప్రేమ, స్నేహాలగూర్చి ఎందుకు చెప్తున్నానంటే తమ జీవితభాగస్వాముల్నెన్నుకోవడంలో స్వేచ్ఛ ఎంత ఆనందదాయకంగా ఉంటుందో మలబారు యువతులకు చూపించడానికి; యుక్తవయస్సువచ్చిన విద్యావంతురాలైన యువతికి విద్యాధికుడూ, సౌందర్యవంతుడూ, మచ్చలేని నైతికప్రవర్తనగలవాడూ అయిన మాధవన్‌లాంటి యువకుడు మొదట పరిచితుడుగాను, తర్వాత స్నేహితుడుగాను, క్రమంగా మరింతదగ్గరై తనను ప్రేమించడం, తననే అతని ఆనందానికి ఈప్రపంచంలో ఏకైక కారణంగా భావించడం, తనులేకుండా ఈ విశ్వంలో అతను బ్రతకడం అసంభవమనుకోవడం, తన సంతోషం కోసం అతడు తన సర్వస్వాన్నీ త్యాగంచేయడానికి సిద్ధపడడం - వీటన్నింటినీ చూడడం, పరిశీలించడం, ప్రశంసించడం, ప్రేమించడం ఎంత మహోన్నతానందాన్ని కల్గిస్తుందో చూపించడానికి. ఇటువంటి స్వచ్ఛమైన, మధురమైన అన్యోన్యప్రేమప్రేరితమైన కలయికలుమాత్రమే వివాహాలనబడే అర్హతను కలిగి ఉంటాయి. వివాహవిషయంలో తక్కిన హిందూస్త్రీలకంటే కొంత ఎక్కువ స్వేచ్ఛనే

కలిగిఉన్న నాయర్ స్త్రీలు ఈవిధంగా తమభర్తలను నిర్ణయించుకోవాలని నాహృదయపూర్వకమైన ఆకాంక్ష.

ఇందులేఖ మాధవన్ను వివాహం చేసుకోవాలనుకోవడం తెలిసి నప్పటికీ పంచుమీనన్ ఈపెళ్ళినాపాలని అనుకోలేదని చెప్పడంతో ఈ అధ్యాయం ముగుస్తుంది. చందుమీనన్, మాధవన్‌లమధ్య తగాదా నిశ్చయం తర్వాత కొన్నిమాసాలకు జరిగిందని గుర్తుంచుకోవాలి. ఈపోట్లాటతర్వాతే ఈ సంబంధాన్ని చెడగొట్టాలని పంచుమీనన్ నిర్ణయించుకున్నాడు.

ఇరవై అధ్యాయాల్లో (498 పేజీలు) చెప్పిన కథను సంక్షిప్తంగానైనా ఒక సాధారణ లేఖలో చెప్పడం అసంభవమే.

పంచుమీనన్ ఇందులేఖ, మాధవన్‌ల వివాహాన్ని భగ్నం చేయాలని నిర్ణయించుకున్నతర్వాత జరిగిన సంఘటనలు అటువంటి పరిస్థితుల్లో మల బారులో నాయర్ తార్వాడ్లలో అతిసాధారణంగా జరిగేవే. వాటికి ప్రత్యేక మైన వివరణేమీ అవసరంలేదు. ఈ సంఘటనలు మలబారులోని రకరకాల ప్రజల స్వభావాలను వర్గీకరించడానికి ఉపలక్షించబడ్డాయి. ఈవిషయంలో నేనెంతవరకు సఫలుణ్ణయ్యానో నిర్ణయించవలసింది పాఠకులే. ఉన్నత, నిమ్న సాంఘికస్థాయులకు చెందిన నాయర్లు, భిన్నస్థానాల్లోని నంబూద్రీలు పట్టార్ బ్రహ్మణులు మొదలైన విభిన్నపాత్రల్ని ప్రవేశపెట్టాను. పరస్పరం బాగా అవగాహన చేసుకున్న ఉన్నత యూరోపియన్ అధికార్లూ, వాళ్ళ దేశీయ స్నేహితుల మధ్యఉన్న సంబంధాలనుకూడా విడిచిపెట్టకుండా చెప్పాను. ఈ విషయాలన్నీ చెప్పడానికి ఈకథాస్థానాన్ని మలబార్ ఆవల స్థానాలకుకూడా తీసుకొనిపోవలసి వచ్చింది. పంచుమీనన్ ఇందులేఖేకాక వాళ్ళ అమ్మకూడా (పంచుమీనన్ కూతురు) ఈ వివాహం జరగాలని ఉత్సు కతతో ఉన్నట్లు, అందుకు ఆమె ఇందులేఖ మాధవన్‌లకు రహస్యంగా సహాయం చేస్తున్నట్లు అనుమానించాడు. ఈ విషయం తెలిసింతర్వాత వృద్ధుడు కోపంతో పిచ్చివాడయ్యాడు. మాధవన్ ఇందులేఖను వివాహంచేసుకో నివ్వనని గృహదేవతవద్ద ప్రతిజ్ఞకూడా చేశాడు. కాని సంకుచితహృదయు డైన కారణవన్ మాధవన్‌ను విడిచిపెట్టేటట్లు తనమనుమరాలు ఇందులేఖ చేత ఒప్పించలేకపోతాడు. ఈవివాహాన్ని భగ్నంచేయడానికెన్నో ప్రయ త్నాలుచేస్తాడు. ఒక పలుకుబడిఉన్న ధనిక నంబూద్రీపాద్‌తో (మల

బారులో సామాన్యంగా కనిపించే నీతి, నియమం, సిగ్గూయెగ్గూలేని చంచల స్వభావులైన ధనిక నంబూద్రిపాదులకు ఇతడు ప్రతినిధి) పరిచయంచేస్తాడు. ఈధనికుడు ఇందులేఖ హృదయాన్ని ఆకర్షిస్తాడని ఆశిస్తాడు. నంబూద్రిపాద్ తన ప్రయత్నంలో పూర్తిగా విఫలుడౌతాడు. కాని పంచుమీనన్ నంబూద్రిపాద్‌ను ఆనందపరచడంకోసమని ఒక మేనకోడల్ని (అమాయక అసహాయ బాలికను) ఈ నీతినియమములు లేనివాడికిచ్చి వివాహం చేస్తాడు. ఈ నంబూద్రిపాద్ ఇందులేఖతో ప్రేమ సాగిస్తూనే పంచుమీనన్ ఇంట్లో మరి కొందరు స్త్రీలతో చివరికి ఇందులేఖ తల్లితోకూడా ప్రేమకలాపం సాగిస్తాడు.

పంచుమీనన్ కోడలితో వివాహమైంతర్వాత ఇందులేఖమీద పగ తీర్చుకోవడానికి ఆమె తన ఉంపుడుకత్తె అయిందనే తప్పుడు ప్రవాదాన్ని నంబూద్రిపాద్ పుట్టిస్తాడు. కపటి, దుర్మార్గుడు అయిన ఒక నంబూద్రిపాద్ అనుచరుడు చాలామంది ఈ ప్రవాదాన్ని నమ్మేటట్లు చేస్తాడు. బాహాటంగా ముసలివాడి వ్యతిరేకతను లెక్కచేయకుండా ఇందులేఖను వివాహం చేసుకోడానికి మద్రాసునుండి (పంచుమీనన్‌తో తగాదావచ్చింతర్వాత తార్వాడును విడిచిపెట్టి మాధవన్ ఇక్కడే నివసిస్తుంటాడు) తిరిగివస్తూ ఇందులేఖ నంబూద్రిపాద్ భార్య లేక ఉంపుడుకత్తె అయిందని వింటాడు. అబద్ధాలే అయినా సంభావ్యాలుగా కన్పించిన అనేక కారణాలు దురదృష్టవశాత్తూ ఈ కథను మాధవన్ నమ్మేట్లు చేస్తాయి. ఈ కథను విశ్వసించిన మాధవన్ చాలా దుఃఖించి, ఈ విషయంలో మరేమీవిచారించక కనీసం మలబారులో తన ఇంటికికూడా పోకుండా దేశంవిడిచి ఉత్తరభారతం ప్రవాసం పోతాడు. మాధవన్‌లేని సమయంలో జరిగిన అనేక సంఘటనలు తర్వాత చెప్పబడ్తాయి. ఇందులేఖ తనప్రేమకు కట్టుబడి అనేక ప్రయత్నాలతర్వాత మాధవన్ జాడ కనుక్కుంటుంది. మాధవన్ వాస్తవాన్ని తెలుసుకుని వెంటనే మలబారుకు వచ్చి ఇందులేఖను వివాహం చేసుకుంటాడు. ముసలికారణవన్ పంచుమీనన్ (సంకుచిత స్వభావుడైనప్పటికీ) మరీ అంత చెడ్డవాడుకాదు. తన మనుమరాలు ఇందులేఖ అంటే చాలాప్రేమ అతనికి. పరిస్థితుల ఒత్తిడికి లోబడి తనప్రతిజ్ఞను వెనక్కుతీసికోవడానికి అత్యాశాపూరితులైన బ్రాహ్మణ పురోహితులు తమ లాభానికి చెప్పినట్లుగా ప్రాయశ్చిత్తం చేసుకోవడంతో కథ ముగుస్తుంది.

కొంతమంది నా మలయాళీస్నేహితుల ప్రత్యేక కోరికమీద 18వ అధ్యాయం రాశాను. ఇందులో మొదటిసగం నేడు విద్యావతులైన మలయాళీలలో ప్రచారంలోఉన్న నిర్దైవతావాదం లేక ఆధునిక నిర్మతవాదాన్ని గూర్చి, మిగతాసగం జాతీయ కాంగ్రేస్ మంచిచెడ్డలగూర్చి చర్చిస్తుంది. మాధవన్ అతని తండ్రి, బావలమధ్య సంభాషణరూపంలో ఈచర్చ జరిగింది. మాధవన్ బావ పట్టభద్రుడు, కాంగ్రేస్ వ్యతిరేకి నిర్దైవతావాది.

మాధవన్ కొంతవరకు కాంగ్రేస్వాది. నాస్తికుడు మాత్రం కాదు. మాధవన్ తండ్రి పరమవైదికుడు. వీళ్ళసంభాషణ మతాన్నిగురించి ఈ ముగ్గురూ ఏమనుకుంటున్నారో తెలుపుతుంది. గోవిందకుట్టి కాంగ్రేసును విమర్శిస్తే మాధవన్ కొంతవరకు సమర్థిస్తాడు. కాంగ్రేసు నిబంధనావళిలో కార్యకలాపాలలో కొన్నిదోషాలున్నాయనిచెప్తూ వాటిని తొలగించితే బాగుంటుందని సలహా యిస్తాడు మాధవన్''.

# 5

# ఇందులేఖ - ఒక పరిశీలన

ఇందులేఖ పందొమ్మిదోశతాబ్దంలో నాయర్ తార్వాడ్ల లేక మరుమక్కత్తాయం ఉమ్మడి కుటుంబాల జీవితగాథ. కొన్ని సాధారణ సంఘటనలు విశిష్ట పాత్రలు మనముందుకు తేబడ్డాయి. కుటుంబసర్వాధికారి తార్వాడ్ కారణవన్. అతని అధికారస్వభావం, తక్కిన సభ్యులను అతడు చూచే పద్ధతి తార్వాడ్ స్త్రీలు న్యాయసంబంధాలు వాటి ప్రతిస్పందనలు వీటన్నిటికీ చక్కని ప్రతిచిత్రాలు మనకు లభించాయి. తన నవలల్ని రాసేటప్పుడు చందుమీనన్ మనస్సులో కొన్ని లక్ష్యాలున్నాయి కాబట్టి సహజంగా పాత్రలు సంఘటనలు ఆ లక్ష్యాలకు తగినట్లుగా ఎన్నుకోబడి మలచబడ్డాయి. అందువల్ల పాతకారణవన్లు ఇందులేఖలోని పంచుమీనన్, శారదలోని కొప్పున్ని

అచ్చన్‌లు కోపిష్ఠులు, నిరంకుశులుగా చిత్రించబడ్డారు. తార్వాడ్‌లోని ఒక పిల్లవాణ్ణి సరిగా చూడమన్నందుకు పంచుమీనన్ తన మనుమడు మాధవన్‌ను శిక్షించవూనుకున్నాడు. ఈయన 70 ఏళ్ళ రిటైర్డ్ తాసిల్దారు చంభాజియోత్ పూవల్లి ధనిక కుటుంబానికి కారణవన్. నిగ్రహించుకోలేని ఆగ్రహం ఇతనిది. ప్రాచీన సంప్రదాయవాది. తెల్లగా, పొట్టిగా, లావుగా ఉంటాడు. అతడు అందంగా కన్పిస్తాడనడానికి అతని రంగొక్కటే ఆధారం. బట్టతలా, మూడుపైపళ్లూ, ఐదు కిందిపళ్లూ ఊడిపోయి కళ్లు ఎర్రగా ఉంటాయి. నడుంచుట్టూ కట్టుకున్న బట్టమీద బంగారు బెల్టు పెట్టుకుంటాడు. బంగారు రుద్రాక్షమాల మెడలో వేసుకుంటాడు. తలమీద ఉన్నిటోపీ పెట్టుకుంటాడు. చేతిలో ఒక మందపాటి వెండిపొన్నుకర్ర పట్టుకుంటాడు. ఆయన తిట్లుపడకుండా పూవల్లినివాసులకు ఒకరోజైనా నడిచేదికాదు. ఇందులేఖలో వచ్చే చక్కని పదచిత్రాలకు ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

అయితే ఈయనెప్పుడూ చిటపటలాడుతుంటాడని అనుకోవడానికి వీల్లేదు. ఇందులేఖతో ఈయన సంబంధాలు వాత్సల్యపూర్వకంగాను, సానుభూతిపరంగానూ ఉంటాయి.

సూరి నంబూద్రిపాద్‌ను నీతిబాహ్యుడుగాను, అవివేకిగాను చూపింటాడు. 'అతను నవ్వినప్పుడు నోరు ఆచెవినుంచి ఈచెవివరకూ వ్యాపిస్తుంది. అతనిముక్కు వికారంగా లేకపోయినా అతని ముఖానికి చిన్నదిగా అనిపిస్తుంది. నడవడానికి బదులు కాకిలా గెంతుతుంటాడు. అతనికి చాలా మంది భార్యలు. తన్నుతాను భువిలో అపరమన్మథుణ్ణనుకుంటాడు. 'స్త్రీలప్రేమను పొందడంవల్లకలిగే ఆనందంకంటే గొప్ప ఆనందం మనిషికేముంటుం'దని ప్రశ్నిస్తాడు నంబూద్రిపాద్ ఇది అతని తత్వం. ఈపాత్ర చాలాచక్కగా బలంగా చిత్రించబడింది. తాను పూర్తిగా కులాన్ని దూషిస్తున్నట్లు అపార్థం చేసుకుంటారేమోనన్న అనుమానం చందుమీనన్‌కు కలిగింది. నవల ప్రచురింపబడినవెంటనే ఈ పాత్రను గురించి నిజంగానే కొంత ఆందోళన కలిగినట్లు కన్పిస్తుంది. చందుమీనన్ తన అభిప్రాయాలను ఇట్లా వివరించాడు 'నేను నంబూద్రీలకిచ్చే గౌరవంకంటే ఎక్కువ గౌరవాన్ని పొందేవర్గం మలబారులో మరేదీ లేదు. తమ మేధాశక్తికీ, సామర్థ్యానికి ప్రసిద్ధిచెందిన నంబూద్రీలెంతోమంది నాకు తెలుసు. అందులో కొంతమంది

నాకు సన్నిహిత మిత్రులు కావడం నాకు గర్వకారణం' సూరి నంబూద్రి పాద్‌ను అతని స్థానంలోనే ఉంచిన ఇందులేఖచేతకూడా ఇలా అనిపిస్తాడు. "నంబూద్రీలలోగూడ ఇతర అన్ని వర్ణాలలో ఉన్నట్లే గొప్ప మేధావు లున్నారు."1

ఏదిఏమైనా చందుమీనన్ సూరి నంబూద్రిపాద్ ద్వారానే నవలలో హాస్యరసాన్ని ప్రవేశపెట్టాడు. పాత్ర చిత్రణలాగానే 'ఇందులేఖ'లోని హాస్యంగూడ శక్తివంతమైన అయస్కాంతంలాగా తరతరాల పాఠకుల్ని ఆకర్షిస్తుంది. మనం కథ చదివేటప్పుడుగాని, అంతకంటె ఎక్కువ చూచే టప్పుడుకాని (నాటకంగా)2 సూరి నంబూద్రిపాద్ కన్పించినపుడల్లా నవ్వొస్తుంది. అతడు నవరజిత మన్మథుడిలా తన పల్లకినుండి వెలువడి నపుడు, స్త్రీలపై తన విజయాలను గొప్పగా చెప్పుకొంటునప్పుడు, ఇందు లేఖతో అతనికి జరిగిన సమావేశంలో అతని మాటలు చేతలు చూచిన మనం అన్నిసార్లు నవ్వుతాము. ఇందులేఖచేత నిర్మొహమాటంగా తిరస్కరించబడి, జంకుగొంకు లేకుండా కల్యాణికుట్టివెంబడి ఆమెతో ఆడవాళ్ళ స్నానశాలలో ప్రవేశించిన హాస్యపూరితఘట్టం మనల్ని పొట్టచెక్కలయ్యేటట్లు నవ్విస్తుంది. ఈ విషయాలు తెలుసుకొన్న గోవిందన్ అనే సేవకుడు ఈ ఆడపిల్లల వేట గాణ్ణి ఎవరూ పట్టుకొనకముందే క్లిష్టపరిస్థితినుంచి తప్పిస్తాడు. అనేక సందర్భాలలో పంచుమీనన్ ఆగ్రహావేశాలుకూడ నవ్వుతెప్పిస్తాయి. ఉదా హరణకు గోపాలన్, షీనుపట్టార్, చాథర్‌మీనన్‌లతో అతడు కలసికొన్న సందర్భాలు చెప్పవచ్చును. చందుమీనన్ వీళ్ళని మంచి వినోదకారులుగా చిత్రించాడు. నంబూద్రిపాద్‌ను విదూషకుడుగా, పంచుమీనన్‌ను ముసలి మిణుగురుపురుగులా చిత్రించాడు.

కేశవన్ నంబూద్రి యంత్రాలను గూర్చిన అజ్ఞానాన్ని ప్రకటించడం, తనభార్యను సూరినంబూద్రిపాద్ ఎత్తుకుపోతాడేమోనని భయపడటంలాంటివి గూడ ఇతర హాస్యరస స్ఫోరకఘట్టాలు.

---

1. పే. 94 ( ఇందులేఖ )

2. ఈ నవల నాటకీకరించబడి అనేక సందర్భాలలో చక్కగా ప్రదర్శించబడ్డది.

ఇంతకంటె భిన్నపద్ధతిలో చిత్రించబడ్డ ఇందులేఖ, మాధవన్, గోవిందకుట్టి మొదలైన ఇతర పాత్రలున్నాయి. మాధవన్, ఇందులేఖలు ఆదర్శవ్యక్తులు. అతి సౌందర్యమూ, గొప్పసామర్థ్యము కలవాడు మాధవన్. అసాధారణ పండితుడు, ఉత్తమ క్రీడాకారుడు. మాధవన్‌కు పరిచయం అయిన యూరోపియన్లంతా మొదటిచూపులోనే అతని గుణగణాలవల్ల ఆకర్షితులై అతని స్నేహితులుగా ఉండిపోయారు. చందుమీనన్ ఆత్మకథే కాదుగదా!

ఆయన ఇందులేఖను గూర్చి మంచి శబ్దచిత్రణ ఇచ్చాడు. ఇందులేఖ అందగత్తెలలో అందగత్తె. నడుంచుట్టు కట్టుకున్న కుట్టుపనిచేసిన వోణీ అంచు జరీరంగును ఆమె శరీరం పోలిఉంటుంది. ఆ రెండింటి భేదాన్ని ఒక్కచూపులోనే గ్రహించడం కష్టం. ఆమె కురుల్నీ, కళ్లనీ ప్రశంసిస్తాడు. తర్వాత ఇందులేఖను సాటిలేని సౌందర్యవతిగా చేసిన అందాలని వర్ణించడానికి ఏ కలమూ సమర్థవంతంకాదని అంగీకరిస్తాడు. ఆమె ఇంగ్లీషు, సంస్కృతం, సంగీతం, చిత్రకళలు, కుట్టుపనులలో మంచి ప్రావీణ్యం కలిగి ఉంటుంది. ఆమె అలవాట్లు కొత్తపాత సాంప్రదాయాల మేలుకలయిక. ఆమె ప్రవర్తన అత్యంత ఆకర్షణీయం. పుట్టినపుడు మాధవి అని పేరుపెట్టిన కృష్ణమీనన్ (తండ్రి), దినదినాభివృద్ధి చెందుతున్న ఆమె సౌందర్యాన్ని చూసి 'ఇందులేఖ' అని పిలచాడు. అంటే చంద్రకిరణం అని అర్థం. తరువాత ఆపేరే స్థిరపడిపోయింది. ఇందులేఖ గుణగణాలను వర్ణించడానికి ఆరుపేజీలు పట్టింది. చివరవరకూ ప్రేమించదగిన గుణాలన్నీ ఇందులేఖలో ఉన్నాయి. వాళ్ళ తాతగారి ఇంటిలో ఆమె కోరికను ఎవరూ కాదనరు. ఆమె కుటుంబంలో రాణీస్థానాన్ని ఆక్రమించిఉన్నా, ఆమె పనులనూ, ఆమె ప్రవర్తననూ ఎవరూ కించిత్తుకూడా అయిష్టపడరు, ఆక్షేపించరు.

ఈ పాత్రలను సృష్టించడంలో ఒక ముఖ్యలక్ష్యాన్నిచూడ్డం ప్రారంభిస్తాం. ఇంగ్లీషు భాషను నేర్చుకోవడంవల్ల మలయాళీలు ముఖ్యంగా స్త్రీలు పొందే లాభాలను నొక్కిచెప్పడమే ఆ లక్ష్యం. ఈ కథలో కల్యాణికుట్టిది ఇందులేఖ వయస్సే. కాని ఆమెకు ఆంగ్ల విద్యాభ్యాసం లేదు. ఆమె తనని ఓపందిగానో, జంతువుగానో చూడ్డాన్ని సహిస్తుంది. నంబూద్రిపాద్ ఎదుర

* పే. 12.

చూస్తున్నగదివద్దకు లాక్కురాబడి లోపలకు నెట్టబడుతుంది. ఇందులేఖకు బదులుగా నంబూద్రిపాద్ కు కారణవన్ ఆజ్ఞప్రకారం ఆమె ఇవ్వబడుతుంది.

ఆంగ్ల విద్యావంతురాలైన ఇందులేఖ తన సౌందర్యంతో నంబూద్రిపాద్ కు మిరుమిట్లు గొల్పుతుంది. అతన్ని మొహంమీదనే నిరాకరించి ఇష్టంలేని అతనితో వివాహ సంబంధంలోకి తనని ఈడ్చడాన్ని నిరోధిస్తుంది. పంచుమీనన్ మొదటిసారి ఈ విషయాన్ని ప్రస్తావించినప్పుడు నిశ్చలంగా నిలబడింది. ఆమె లొంగకపోవడం చూచి పంచుమీనన్ "చూశావా ఇంగ్లీషు చదువుల ఫలితం" అంటాడు. దానికి 18 ఏళ్ళ ఇందులేఖ "నిజంగా తాతయ్యా! నేను మలయాళంలోనే మాట్లాడాను" అంటుంది. ఈ సమాధానం పూవల్లి తార్వాడ్ నియంతను ఏవిధంగా నిశ్చేష్టుణ్ణి చేసి ఉంటుందో మనం ఊహించుకోవచ్చు. ఇందులేఖతో "అవునమ్మా! అవును. నీవెంత తెలివిగలదానవో నాకు తెలియదా?" అని మాత్రమే అనగలుగుతాడు. "నేను ప్రపంచంలో ఎవరికీ భయపడను. కాని ఇందులేఖ అంటే మాత్రం భయం. ఆమెకు కోపంవస్తే నేను భరించలే"నని ఒప్పుకుంటాడు పంచుమీనన్. మలబారు స్త్రీలనుగూర్చి చెడ్డగా మాట్లాడుతున్న మాధవన్‌ను గూడ ఆమె మందలిస్తుంది.

నవలాంతంలో చందుమీనన్ రచనోద్దేశ్యాన్ని వివరిస్తూ "ముఖ్యంగా నాదేశీయులకు ఈ నవలద్వారా పురుషులనుభవిస్తున్న హక్కుల్నే స్త్రీలుగూడ విద్యావిషయంలో అనుభవించడంవల్ల కలిగే లాభాలను తెలియజెప్పడం" అంటాడు. కళ్యాణకుట్టి బలి కావడాన్ని వివరిస్తూ "నాప్రియమైన దేశీయ వనితల్లారా మీరు దీనికి సిగ్గుపడటంలేదా? మీలో కొంతమంది సంస్కృతాన్ని, సంగీతాన్ని నేర్చుకొని ఉండవచ్చు. కాని అవి సరిపోవు. మీరు మీ మనస్సుల్ని జ్ఞానవంతాలు చేసుకోవాలంటే ఇంగ్లీషు నేర్చుకొనితీరాలి. దీనొక్కదానివల్ల మాత్రమే మీరీ రోజుల్లో నేర్చుకోవాల్సిన విషయాలను నేర్చుకోగలుగుతారు. అటువంటి పరిజ్ఞానంవల్ల మాత్రమే మీరు పురుషులతో సమానంగా సృష్టించబడ్డారనే సత్యాన్ని, పురుషుల్లాగే స్వేచ్ఛాయుతజీవులనే సత్యాన్ని, స్త్రీలు పురుషులకు బానిసలు కాదనే నిజాన్ని గ్రహించగలుగుతారు"[2].

---

1. పే. 86.

2. పే. 368

ఉన్నత సమాజంలోని లోపాలను, భారీపరిశ్రమల్లోని దురాగతాలను, వైద్య విధానాన్ని, శరణాలయాలు నిరంకుశపాలన మొదలైన విషయాలను గూర్చిన నవలలెన్నోఉన్నాయి. కాని ఈనవల ముఖ్యంగా భారతీయ స్త్రీలలో తమను తామొకించపరచుకొనే స్వభావంనుంచి, దోపిడీ విధానం నుంచి బయట పడ టానికి వాళ్ళలో విద్యావాప్తి ముఖ్యంగా ఆంగ్లవిద్యావ్యాప్తి అవసరాన్ని నొక్కి వక్కాణిస్తుంది.

ఇందులేఖ నవల ఎంత విశాలవృక్పథం కల్గిందో అంత లోతైనదికాదు. కథలో నిగూఢ హృదయాలున్న పాత్రలు లేవు. వస్తువులో సంక్లిష్టమైన అంతఃప్రవాహాలు లేవు. ఇది దాపరికం లేకుండా చెప్పబడిన ఒక అతి సాధారణమైన కథ. పాఠకులకు స్పష్టంకాని విషయాలనుకూడ చందు మీనన్ అతిమనోహరంగా వివరించి హత్తుకుపొయ్యేటట్లుగా చేస్తాడు. మాధవన్ ఇందులేఖల కలయికకుముందే కథలో మీనన్ "వాళ్ళ ఆత్మలు అప్పటికే కలసిపోయాయి" అని పాఠకుల చెవుల్లో చెప్తాడు. "వాళ్ళ హృదయాంతరాళాలలో ప్రేమవికసించినప్పటికి ఇద్దరిలోఎవరూఏవిధంగానూ పైకి వెల్లడించుకోలేదు" అని చందుమీనన్ పాఠకులకు తెలియజేస్తాడు. నంబూద్రీల గురించి తన అభిప్రాయాల్ని వివరిస్తాడు. ఎందుకంటే పాఠకులు తనను అపార్థం చేసుకోవడం ఆయనకిష్టం లేదు. సూరి నంబూద్రిపాద్ ఎత్తుకవెళ్ళింది కళ్యాణకుట్టినేకాని,ఇందులేఖను కాదనేవిషయాన్ని మాధవన్‌కు గూడ తెలియకుండా రహస్యంగా ఉంచినప్పటికీ పాఠకులు అర్థంచేసుకొనే టట్లు చేస్తాడు. ఇదే ఇంకో నవలాకారుడైనట్లయితే ఈ సత్యాన్ని పాఠకుల నుండి దాచి వాళ్ళలో ముందేమీ జరుగబోతుందోనన్న ఔత్సుక్యాన్ని కల్పించి అదే ఉత్తమనవలా పద్ధతి అనుకొనేవాడు. ఇందులేఖలో అంతా బట్టబయలే. తార్వాడ్ జీవితంలో జరిగే సాధారణ విషయాలే అందులో ఉన్నాయి. ఇలా తరాలమధ్య వచ్చే అభిప్రాయభేదాలు, సంబంధబాంధవ్యాలు, వైవాహిక సమస్యలు, కష్టనష్టాలు కలిగించేబాహ్య ప్రభావాలు మొదలగు సాధారణ విషయాలున్నాయి. ప్రాచీన తార్వాడ్ జీవితంలో నంబూద్రీల విషయం రావడం తరచుగా చూస్తాం. తెలిసిన వ్యక్తులను, ప్రాపంచిక విషయాలను చాలా అత్యాసక్తిదాయకమైన కథగా మలచవచ్చని చందుమీనన్ నిరూపిం చాడు. క్రొత్త వ్యక్తుల్ని, క్రొత్తప్రదేశాల్ని, జరిగిపోయిన కాలాన్నిగూర్చి అర్థం చేసుకోవడంకంటే సామాన్య పాఠకుడు ఈ కథను చదివి చక్కగా

అర్థం చేసుకొని, ఆనందించడం తేలిక. ఇది ఒక సామాన్య మానవుడు అధునిక లేక భవిష్యద్వాదానికి చెందిన ఒక చిత్రాన్నో, శిల్పాన్నో అర్థం చేసుకొని ఆనందించినదానికంటే ఒక వాస్తవికతావాదానికి చెందిన చిత్ర శిల్పాన్ని అర్థం చేసుకొని తేలికగా పరవశం చెందడం లాంటిది.

సన్నివేశాలు, పాత్రలు లాగానే భాషగూడ మలయాళీకుటుంబాలకు పరిచయమైనదే. నిత్యవ్యవహారంలో ఉన్న మలయాళం గుర్తిందగినప సాహిత్యప్రమాణాలకు చెందిన ఏరచనైనాచేయడానికి సమర్థవంతం కాదనే నమ్మకం ఒకటి ఉండేది. ఇందులేఖకు వ్రాసిన పీఠికలో చందుమీనన్ 'నేను ఈ పుస్తకంలో ఉపయోగించిన భాష నేను సాధారణంగా ఇంట్లోమాట్లాడేదే. నాకు కొంత సంస్కృత పరిజ్ఞానం ఉన్నప్పటికీ మలయాళీలు సర్వసాధారణంగా వ్యవహరించే సంస్కృత పదాలను మాత్రమే వాడాలనే నియమాన్ని పెట్టుకొన్నాను'' అంటాడు. చందుమీనన్ నిరుపమాన నిపుణహస్తాలలో వ్యావహారికభాష పుస్తకాన్ని మరింత కమనీయంచేసి, పాత్రల్లో సహజత్వాన్ని నింపి పాఠకులకు మరింత దగ్గరగా తెస్తుంది.

ఇందులేఖ నవల అసమాన లక్షణాలలో పాత్రచిత్రణ ఒకటి. కొన్ని నవలల కథావస్తువు సంక్లిష్టతలతోనూ, వాటినివిప్పడంతోనూ ఆకర్షిస్తాయి. అతిమానుషం లేక అద్భుతం అయిన విషయాలవల్ల కొన్ని నవలలు ఆకర్షిస్తాయి. సన్నివేశాల, పాత్రల బహువిధ కాంతివల్ల కొన్ని ఆకర్షిస్తాయి. కాని ఇందులేఖ ఒక సాధారణ ప్రేమ కథ. నిజమైన ప్రేమమార్గం ఒక పాతకాలపు కారణవన్ తగాదామారితనంవల్ల కంటకావృతమై, చివరలో సహజపితామహప్రేమ కుటుంబపెద్దకోపాన్ని జయించి ప్రేమికుల్ని కలుపుతుంది. నవలలో పెద్ద కథేమీలేదు. కాని మనం పరిచితమైన సంభాషణలవల్ల, ఆకర్షణీయమైన కథనంవల్ల అద్భుతమైన కథనంవల్ల ఈలోపాన్ని గుర్తించలేము. అసాధారణసౌందర్యవతి ఇందులేఖ, ఉత్తముడైన మాధవన్, కాముకుడు సూరి, ముక్కోపి పంచుమీనన్ వీళ్ళందరి రూపచిత్రాలను చక్కగా నిర్మిస్తాడు చందుమీనన్. రైల్వేస్టేషన్ హోటల్లో సర్వరు నుంచీ తప్పును రాబట్టడంలో పోలీస్ ఇన్‌స్పెక్టరు వ్యవహరించిన పద్ధతి, జారీచేసిన ఆజ్ఞలు చాల వాస్తవికంగా ఉన్నాయి. కొన్ని పాత్రలు ఎంత సజీవంగా ఉన్నాయంటే కథ పూర్తయిన తరువాతగూడ అవి ఉన్నాయన్నంత భ్రమను కల్గిస్తాయి. ఉదా

హరణకు సూరి నంబూద్రిపాద్, పంచుమీనన్‌ల పాత్రలను చూపించవచ్చును. దీనికి కారణం చందుమీనన్ పాత్రచిత్రణా నైపుణ్యమే. షేక్స్పియర్ నాటకాల్లో షైలాక్, ఫాల్‌స్టాఫ్‌లు, డికెన్స్‌లో పిక్‌విక్, వోడ్‌హౌస్‌లో జీవ్స్ ఇటువంటి స్వతంత్ర పాత్రలకుదాహరణలు

కథలో మాధవన్ ఆదర్శపురుష పాత్ర. అతను తన అభిప్రాయాలలో హేతుబద్ధంగా ఉంటాడు. వాటి విషయంలో వాదించే శక్తి అతనికి ఉంది. తార్వాడ్‌లో ఒక పిల్లవాని విద్యావిషయంలో అధిక కోపి ఐన కారణవన్‌తో వాదిస్తాడు. కొంతమంది పెద్దలతో ఆంగ్లవిద్యావిషయంలో గూడ వాదిస్తాడు. మారుతున్న భారతీయరంగాన్ని చక్కగా విశదీకరిస్తాడు. మలబారులోని సామాజిక గృహజీవితంలోని పాత ఆచారాల అసమంజసత్వాన్ని ప్రశ్నించే యువతరానికి మాధవన్ ప్రతినిధి. స్వతంత్ర భారతాన్ని గూర్చిన దృష్టిగూడ అతనికుంది. ఇతనికీ, పంచుమీనన్‌కీ మధ్య తరాల అంతరముంది. చాలసార్లు పాపకాలం వచ్చిందనీ, యువకులు దుర్మార్గులని అంటాడు. యువకులు అకార్య కారులని ఆయన వ్యాఖ్య.

మాధవన్ మేధావి, ప్రేమికుడు అయినట్లయితే మలబారును అసహ్యంతో విడిచిపెట్టేటప్పుడు ఇందులేఖ సూరి నంబూద్రిపాద్‌ను వివాహం చేసుకొన్నదన్న పుకారులోని సత్యాన్ని ధృవపరచుకోకుండా ఎట్లా వెళ్ళాడని ప్రశ్న ఉద్భవిస్తుంది. స్వయంగా ఇందులేఖే ఈ విషయంపట్ల అసంతుష్టురాలైంది. "అతనికి నేను బాగా తెలిసినప్పుడు అతను అంత త్వరగా నమ్మడంవల్ల నేను పూర్తిగా విలువలేని దానినయ్యాను" అని బాధపడుతుంది. మాధవన్‌ను సమర్థించడానికి 'ప్రేమకు ఉచితానుచితాలు తెలియవు' అనే పాత సామెత ఒకటి ఉంది. పైగా తాత్కాలికంగా మాత్రమే దారితప్పాడు. "నేను ఆత్మహత్యగాని, మరింకేఘోరమైనవికాని తలపెట్టడం లేదు. నాకు ప్రయాణం చేయడం తప్ప మరి ఇంకేమి ఉద్దేశ్యం లేదు. నేను తప్పక తిరిగి వస్తానని మీరు నమ్మవచ్చు" అని తండ్రికి ఉత్తరం రాస్తాడు మాధవన్. కథాపూర్వ గమనంలో మాధవన్‌లాంటి ప్రధాన పాత్రలేకాక అంత ప్రాధాన్యత లేని పాత్రలుగూడ పాఠకుని ముందుకు వస్తాయి. ఉదాహరణకు మాధవన్ తల్లిదండ్రులు, గోవింద పణిక్కర్, పార్వతి అమ్మలు ఎప్పుడూ అతని శ్రేయస్సును కాంక్షించేవారు. ఇందులేఖ తల్లి లక్ష్మికుట్టి అమ్మ.

ఈమెను చూడగానే సూరి నంబూద్రిపాద్ మతిని పోగొట్టుకున్నాడు. పంచు మీనన్ ఆగ్రహానికి మొదటనే గురైన చాథర్‌మీనన్, సూరి నంబూద్రిపాద్ చిత్తాన్ని ఒక్కక్షణకాలం చలింపజేసిన ఇందులేఖ దాసి అమ్ము, తన యజమాని సూరిని అనేక క్లిష్టపరిస్థితులనుంచి తప్పించినవాడు, కళ్యాణకుట్టిని (ఇంగ్లీషు జ్ఞానంలేని) ఇందులేఖకు మంచి ప్రత్యామ్నాయమని సూచించిన గోవిందన్ మరి కొందర్నిగూడ చెప్పవచ్చును. ఒక అద్భుతమైన కథను అల్లడంలో వీరి పాత్ర స్వల్పం అయినా వీరు ఆసక్తిదాయకమైన పాత్రను నిర్వహిస్తారు.

నవలగా ఇందులేఖలో కొన్ని గొప్పగుణాలున్నాయి ఇప్పటికీ అది మంచి ప్రచారంలో ఉంటటం దీనికి నిదర్శనం. ఈ సుగుణాలతోపాటు ఒక నిర్మాణ దోషం కూడా చూపించడం జరుగుతుంది. 18వ అధ్యాయం కథకు అనవసరమంటారు. పుస్తకంలో దాదాపు ఆరవ వంతు ఆక్రమించిన ఈ అధ్యాయం అన్నింటికంటే పెద్దది. ఇందులో ఇంగ్లీషు భాషాధ్యాయనం మీద, దైవం-మతంపైన, భారతీయ జాతీయ కాంగ్రెస్ మరికొన్ని ఇతర రాజకీయ సమస్యలపైనా చర్చ ఉంది. ఈ చర్చలో మాధవన్, అతని తండ్రి గోవిందపణిక్కర్, పంచుమీనన్ కుమారుడు గోవిందన్‌కుట్టిమీనన్‌లు పాల్గొన్నారు. మాధవన్ ఎవరికీ చెప్పకుండా మలబారును విడిచి వెళ్ళిపోయింతర్వాత వీళ్ళు ముగ్గురూ బొంబాయిలో కలుసుకొన్న సంతోష సమయంలో ఈ చర్చ జరిగింది. గోవింద పణిక్కర్, గోవిందన్ కుట్టిమీనన్‌లు మాధవన్‌ను వెతుకుతూపోయి బొంబాయిలో ఒక స్నేహితుడి ఇంటిలో అతనిని కలుసుకొని ఇందులేఖ అతనికోసం ఎంత బాధపడుతుందో తెలియజేస్తారు. వారు మరుసటి రోజు బొంబాయినుండి మలబారుకు ప్రయాణం కావలసి ఉంది. రాత్రిపండుకొనేముందు వారు ముగ్గురూ ఈ విషయాలపై చర్చ జరుపుతారు. మాధవన్ ఇందులేఖను కలుసుకోవడానికి అసహనంగా వేచి ఉన్నపుడు, వారి కలయికను గూర్చి పణిక్కర్, మీనన్‌లకు అధికాందోళన ఉన్నప్పుడు ఇటువంటి విషయాలపై అంతసేపు వాళ్లు చర్చ సాగించడం సహజమా? అని విమర్శకుడనవచ్చును. మరొకళ్లు ఇన్నిరోజుల ఆందోళన తరువాత ఇందులేఖతనకోసం వేచిఉన్నదనే విషయం మాధవన్‌కు సంతోషం కలిగిస్తుందంటారు. అన్నిదినాలు కనబడకుండాపోయిన మాధవన్‌కు ఏమీహాని జరగకుండా ఆరోగ్యంగా ఉండటం పణిక్కర్, మీనన్‌లకు ఆనందాన్నిస్తుంది.

ఈవిధంగా ఆ సాయంకాలం వారిమధ్యనున్న భయంకరమైన మానసికాందో ళనలన్నీ విడిపోయాయి వారికి వేరే కార్యక్రమాలేవీ లేకపోవడంమూలంగా వారు రాత్రిపూట రెండుగంటలసేపు ఇతర విషయాలగూర్చి మాట్లాడుకోవడం సహజం. 'భారతదేశంలో ఎదురించేశక్తి పెరుగుతోందని మలబారులోని పాతతరానికి తెలియజెప్పడానికి చందుమీనన్ ఈ అధ్యాయాన్ని ఉపయోగించాడు' అని శ్రీ బాలకృష్ణన్ చెప్పాడు. టాల్‌స్టాయ్, దోస్తోవిస్కీ, విక్టర్ హ్యూగోలవంటి ప్రఖ్యాత నవలాకారులు కూడా తమ కథల్లో ఇటువంటి అప్రస్తుత అప్రధానభాగాల్ని చేర్చారని అదే వ్యాఖ్యాత సూచించాడు. ఈ అధ్యాయం యొక్క ఔచిత్యాన్నిగూర్చి చందుమీనన్‌క్కూడ కొన్ని అనుమానాలున్నాయని మనం గుర్తించాలి. ఎందుకంటే "18వ అధ్యాయాన్ని కొందరు మలయాళీ స్నేహితుల కోరికపై ప్రత్యేకంగా రచించాన"ని ఆయనే చెప్పుకొన్నాడు.* ఆయన ఎందుకిలా క్షమార్పణ చెప్పుకొన్నాడు? ఇంకో వాస్తవం ఏమంటే ఈ మధ్య వచ్చిన ఇందులేఖ ప్రచురణలో ఈ అధ్యాయం విడిచివేయబడింది. ఆధునిక పాఠకుడు దీన్ని గమనించలేడు. ఉత్తమ నవలాకారుడుగా చందుమీనన్ కథలో ఈ అధ్యాయం ఉండాలని బహుశా భావించి ఉండడు. నవలాకర్త సరసన అతనిలో భవిష్యద్దర్శకుడు, సంస్కర్త లున్నారుకాబట్టి మిత్రుల కోరికపై ఆయన ఈ అధ్యాయాన్ని రచించి ఉంటాడు. మొత్తం నవలే ఒక మిత్రుణ్ణి ఆనందపరచడానికి వ్రాయబడింది కదా !

ఈ వివాదాస్పదమైన అధ్యాయం విషయంలోనేకాక ఈనవల ఆంగ్ల విద్యను సమర్థిస్తుందనే విమర్శ కూడ ఉంది. పాత కొత్త తరాలమధ్య వర్తమాన, భావితరాలమధ్య ఉత్పన్నమవుతున్న వైరుధ్యాలను ఇందులేఖ నవలలో గమనిస్తాము అని ముందే చెప్పుకొన్నాడు. ఈ తరాల మధ్య వైరుధ్యం వయోభేదంవల్ల వచ్చింది కాదు. ఆంగ్లవిద్యవల్ల వచ్చింది. పంచుమీనన్, సూరి నంబూద్రిపాద్‌లవంటి ముసలి, పాత పద్ధతికి చెందిన పాత్రలకు ఇంగ్లీషు తెలియదు. చందుమీనన్ వాళ్ళచేత తెలివి తక్కువ మాటలు మాట్లాడిస్తాడు. ఉదాహరణకు మాధవన్ వాదిస్తాడని, బూట్లు వేసుకొంటాడని, ఇంగ్లీషు చదువుకోవడంవల్ల స్త్రీలు అపవిత్రులవుతారని అంటారు. ఇంగ్లీషు చదువుకోకపోవడంవల్లనే విశాలహృదయంలేని సంప్ర

(పే. XXIV)

దాయ వాదియైన నియంత పంచుమీనన్ అందరిమీద (ఒక్క ఇందులేఖపై తప్ప) ఆగ్రహం కురిపిస్తాడు.

సూరి నంబూద్రిపాద్ విదూషకుడు. అతనికి ఇంగ్లీషు రాదు. ఇందు లేఖ ఇంటికి వచ్చినపుడు ఇతని ఆకారాన్ని చందుమీనన్ ఎట్లా వర్ణిస్తాడో చూడండి. 1'' పల్లకీలోంచి ఒక బంగారు ఆకారం బయటికి దూకింది. దాని తల బంగారు రంగు టోపీతో ఆచ్ఛాదించబడింది. శరీరం బంగారు రంగు అంగీతో ఆవరించబడింది. అది ధరించిన అన్ని వస్త్రాలు బంగారు రంగులోనే ఉన్నాయి. చెప్పులు బంగారం పొదగబడి ఉన్నాయి. పది వేళ్లకూ బంగారు ఉంగరాలున్నాయి. ఇవి చాలనట్లు ఒక బంగారు రంగు పొడవాటి కోటు ఉంది. దాని చేతిలో మాటి మాటికీ చూచుకోడానికో బంగారు అద్దం ఉంది. 'అతను' అనడానికి బదులు 'అది' ఉపయోగించడం గమనించండి. దీనికి భిన్నంగా ఆంగ్ల విద్యాభ్యాసం చేసిన మాధవన్, ఇందులేఖలు పరిపూర్ణ మానవులుగా చిత్రించబడ్డారు. మాధవన్ అదృశ్యం అయిన తరువాత అతని తల్లి పార్వతిఅమ్మ ఇందులేఖకు ''నీవు అతనికి ఇంగ్లీషులో అతన్ని వివాహ మాడటానికి సిద్ధంగా ఉన్నానని రాసినట్లయితే నా కుమారుడు రెండు రోజుల్లో తిరిగి వస్తాడ'' ని 2 సూచిస్తుంది పాఠకుల మనస్సుల్లో ఉత్తరం ఇంగ్లీషులోనే ఎందుకుండాలనే తమాషా ప్రశ్న ఉదయిస్తుంది. ఇందులేఖ మలయాళంలో ఉత్తరం వ్రాస్తే మాధవన్ తిరిగి రాడా ?

భారతదేశంలో ప్రస్తుత పరిస్థితుల్లో ప్రత్యక్షంగాకాని పరోక్షంగాకాని ఆంగ్లభాషను, విద్యనూ, సమర్థించడాన్ని కొంతమంది నవలలో విచారకర మైన లక్షణంగా భావిస్తారు. కాని చందుమీనన్ కాలంలో మలయాళ సాహిత్యం సామాన్య విజ్ఞానశాస్త్రంలోగాని, సాంకేతిక విజ్ఞానంలోగానీ అభివృద్ధి చెందని (ఇంగ్లీషుతో సమంగా) రోజుల్లో చందుమీనన్ సరిగ్గానే చెప్పాడు ముఖ్యంగా స్త్రీల నుద్దేశిస్తూ ''మీరు ఇంగ్లీషు నేర్చుకొనితీరాలి. అట్లా నేర్చుకోవడంవల్ల మాత్రమే మీరు ఈ రోజుల్లో తెలుసుకోవలసిన

1. పే. 132.

2. పే. 354

విషయాలను తెలుసుకుంటాడు'' అని చెప్పాడు. 'ఇంగ్లీషు లేకుండా విజ్ఞానం లేదని నేననను' అని కూడా రాస్తాడు.

ఈ ఇంగ్లీషు విద్యా సమర్థనను బట్టి ఇవ్వాళ చందుమీనన్ సాంప్రదాయవాదియైన సామ్రాజ్యవాది అనవచ్చును. 19 వ శతాబ్దిలో తయారయిన వాణ్ణిగా అతన్ని పరిశీలించినట్లయితే ఇందులేఖ ఒకవిధంగా విప్లవాత్మక నవలగా కనిపిస్తుంది; ఆయన భారతీయ స్త్రీలలో నిరక్షరాస్యతకు వ్యతిరేకంగా పోరాడే తిరుగుబాటుదారుడుగాను, వాళ్ళలో విద్యావ్యాప్తికోసం ముఖ్యంగా ఆంగ్ల విద్యా వ్యాప్తికోసం పోరాడినవాడుగాను కనిపిస్తాడు.

ఇందులేఖ నవలను అంతరిస్తున్న పాత తరంపై నూతనతరం తిరుగుబాటుగా భావించి పరిశీలిస్తే అందులో మనం ఒక సంఘటనను చూడవచ్చు. పంచుమీనన్ తానే స్వయంగా బాల్యంలో యువకులు చెప్పులు ఉపయోగించకూడదన్న సంప్రదాయాన్ని ఉల్లంఘించాడు. పంచుమీనన్ తానే ఈ సంఘటనను చెప్తాడు. చెప్పులు తొడుక్కున్నట్లు వెల్లడయినపుడు విపరీతంగా దెబ్బలు తిని 20 రోజులు పక్కమీదనుంచి లేవలేదతను. వాళ్ళ చిన్నాన్న ఆ చెప్పుల్ని తగులబెట్టించాడు. అప్పటినుండీ అతను చెప్పులెప్పుడూ ఉపయోగించలేదు. వాటిని చూస్తేనే భయపడేవాడు తరువాత. 1

ఈవిధంగా పంచుమీనన్ బాల్యంలో కూడా పాత కొత్త తరాలమధ్య సంఘర్షణ ఉండేది. అయితే అప్పుడు పాత వ్యవస్థ చాల దృఢంగా ఉండేది. అందువల్లనే పంచుమీనన్ చెప్పులు పోగొట్టుకున్నాడు. అతను వృద్ధుడయ్యేనాటికి కొత్తతరం బలపడింది. మాధవన్ చెప్పులు, బూట్లు ఉపయోగించసాగాడు. 'అతను వాటిని ఇంటిలోపల గూడ ఉపయోగిస్తాడు!' పంచుమీనన్ తన ఆనందరవన్‌లలో ఒకడి విద్యాభ్యాసాన్ని తిరస్కరించడంలోని న్యాయాన్ని గూడా మాధవన్ ప్రశ్నిస్తాడు. పంచుమీనన్ అనవసర ప్రసంగాన్ని ఆనందరవన్‌లో గోపాలన్ నిరసిస్తాడు. ఈ పోరాటం పాత తరానికి ఓటమి కారణంగా అనే విషయాన్ని గ్రహించిన పంచుమీనన్' అంతా అపసవ్యంగానే జరుగుతుందిప్పుడు. ఇది చెడుకాలానికి తార్కాణం' అని దిగులుగా అంటాడు. ఆమె వివాహాన్ని నిర్ణయించడంలో ఆమెను సంప్ర

---

1. ఫే. 73

దించాల్సిన అవసరమేమీ లేదని పంచుమీనన్, కేశవన్ నంబూద్రిలన్నప్పుడు ఇందులేఖ లొంగలేదు కూడా.

"ఇది అతిఘోరం. అయితే ఇప్పుడు నన్నడగడం వల్ల ప్రయోజనమేమిటి? నాకు తెలియకుండా నిర్ణయం చేసుకోవచ్చును. అలాగే చేసుకొన్నారు గూడ!" అని ఇందులేఖ ఆశ్చర్యం ప్రకటిస్తుంది.

ఇందులేఖ ప్రకాశమైన ముఖంలో కన్పిస్తున్న ధృఢ నిశ్చయం చూసి పంచుమీనన్ భయపడ్డాడని రచయిత రాస్తాడు.

ఆమె సూరి నంబూద్రిపాద్‌ను లెఖ్ఖచేయలేదు. అతను తనను గురించి చెప్పుకొనే తెలివితక్కువ అధికప్రసంగాన్నామె సహించలేదు. ఈ ధనవంతుడైన పెళ్ళికొడుకుతో గౌరవప్రదంగా ఉచితరీతిలో మాటల్నుపయోగించి సంభాషించవలసిందిగా ఇందులేఖకు ముందే సలహా ఇవ్వటం జరిగింది. అలాంటి సంభాషణేదో తనకు తెలియదన్నట్లు చెపితే ఆమెకు ఇష్టంవచ్చినట్లు మాట్లాడమంటారు. 'ఖచ్చితంగా అదే నేను చేయదలచుకున్నది' అన్నది ఇందులేఖ వ్యాఖ్య. తనకేది ఇష్టమో ఆమె అతనికి చెప్పివేసింది. అతనితో జరిగిన రెండు సమావేశాల్లోను అతని తెలివితక్కువ మాటలకు ఆమె మాటి మాటకీ సూటిపోటిగా మందలిస్తుంది. కొత్త తరానికి చెందిన చదువుకున్న మలయాళీ బాలికు జరుగుతున్న దగాక వ్యతిరేకంగా తిరుగుబాటు చేసింది. స్త్రీలలో విద్య లేకపోవడమే ఈ రకంగా మోసపోవడానికి కారణమని చందుమీనన్ విశ్వసించాడు. స్త్రీలను పాఠశాలకు దూరంగా విద్యారహితులుగా ఉంచే సమకాలీన అభ్యాసానికి అతను దృఢమైన వ్యతిరేకతను వెలిబుచ్చాడు. బెంగాల్‌లోని కొన్ని ప్రాంతాల్లో స్త్రీలు చదువుకొంటే త్వరగా విధవలవుతారనే నమ్మకం ఉండేది.[1] చందుమీనన్ కాలంలో అంటే 1882 ప్రాంతంలో లభిస్తూన్న లెక్కల్నిబట్టి భారత స్త్రీ జనాభాలో 800 మందిలో ఒక్కళ్ళుమాత్రమే చదువు కొంటున్నారు.[2] ఇందులేఖ నవల చివర అతను 'భారతీయ స్త్రీలు విద్యారహితంగానూ, అజ్ఞానంలోను ఉన్నంతకాలం పురుషులు వాళ్ళని నిందాపూర్వకంగా చూడటమేగాక తమ

---

1, 2. స్త్రీ విద్యపై జాతీయ సంఘం 1959 లో ఇచ్చిన నివేదిక.

ప్రవర్తన ద్వారా వారు అల్పులు అనే అభిప్రాయాన్ని వెల్లడిస్తారని విషయాన్ని గుర్తించాలి' అని రాశాడు. ఈ స్త్రీవిద్యా సాధన విషయంలో కూడా చందుమీనన్ ఆకారాన్ని బట్టి చూస్తే ఒక విప్లవకారుడు, విద్యావంతురాండ్రై, పీఠనుంచి బయటపడిన భవిష్యద్ మలబారు స్త్రీని, భారతీయ స్త్రీని ఆయన దర్శించాడు. పరాయి అధికార శృంఖలాలనుండి స్వేచ్ఛ పొందిన భారతజాతిని ఆయన దర్శించాడు.

ఇందులేఖ పొందుతున్న అనన్య ప్రజాదరణ మూలంగా దాన్ని గొప్ప నవలారాజంగా పేర్కొనవచ్చు. అది ఇక ముందుగూడ ప్రచారంలో ఉండటం రచయితకు మరింత కీర్తిదాయకం. పాత్రచిత్రణ, హాస్యం వ్యవహారిక కథనంలాంటి సముచిత కారణాలవల్ల మాత్రమే నవల ప్రజానురంజకం కావడం రచయిత కీర్తిప్రతిష్ఠలను పెంచాయి. ఒక చిత్రకారుడు తన రంగుల పెట్టెలో అనేక రకాల రంగులు ఉన్నా కూడా రెండు మూడు రంగుల్నే ఉపయోగించి అత్యద్భుతమైన చిత్రాన్ని, తయారు చేసినట్లుగా ఉంది. వాస్తవానికి అతను అన్ని రంగుల్ని ఉపయోగించకపోవడం చిత్రంలో లోపం కాదు పైగా చిత్రకారుడి ప్రతిభను ఎత్తి చూపుతుంది. నవలారచనకు వస్తువు, పాత్రలు, భాష, నేరము, సస్పెన్స్, హాస్యం విజ్ఞానశాస్త్రం లాంటి అనేక విషయాలున్నప్పటికీ ఏవో కొన్ని మాత్రం ఉపయోగించి గొప్ప నవల్ని నిర్మించడం, అత్యద్భుతమైన రచన చేయడం అసాధారణ ప్రతిభావంతుడైన రచయితకే సాధ్యమవుతుంది. చందుమీనన్ అటువంటి రచయిత.

**6**

# శారద

'న్యాయవాదులు కలుసుకున్నారు. అభియోగం తయారయింది'

—గే

రామేశ్వరంలోని ఒక హోటలు గదిలో కథ ప్రారంభమవుతుంది. అక్కడ రామన్ మీనన్ అనే చిత్రకారుడు తన భార్య కల్యాణిఅమ్మతోను, 12 సంవత్సరాల కుమార్తె శారదతోనూ ఉంటూ ఉంటాడు. రామన్ మీనన్‌తో అతని విద్యార్థి శంకరన్, నౌకరు పిల్లవాడు కృష్ణన్ కూడా ఉంటారు. ఒకరోజు హఠాత్తుగా జబ్బుచేసి అనుకోకుండా కళ్యాణిఅమ్మ చని పోతుంది. ముందు ఏం చేయాలో నిర్ణయించుకొనేవరకూ రామేశ్వరంలోనే ఉండాలని రామన్ మీనన్ నిశ్చయించాడు. ఉత్తర భారతదేశంలో అనేక సంవత్సరాలనుండి నివసిస్తూ వాళ్ళు దక్షిణ భారతదేశంతో సంబంధం లేకుండా ఉన్నారు. రామేశ్వరానికి తీర్థయాత్రకై వచ్చారు. రెండు రోజుల తరువాత వాత్సల్యపూరితుడైన తండ్రి అమాయకురాలైన కుమార్తెకు తమ గతాన్ని గూర్చిన కథను చెపుతాడు.

కళ్యాణిఅమ్మ మలబారులోని పూంజోలక్కర ఏదమ్ అనే పెద్ద ధనిక భూస్వామి తార్వాడ్‌కుచెందిన స్త్రీ; ఆమె పిన తండ్రి కారణవన్ లేక కుటుంబ పెద్ద కొప్పున్ని అచ్చన్ చాల నిరంకుశుడు, దుర్మార్గుడు. తన స్వార్థంకోసం ఆయన కళ్యాణిఅమ్మను ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఒక వృద్ధ ధనికుడి కిచ్చి వివాహం చేశాడు. ఆమె ఈ వివాహంతో సర్దుకొని పోలేక చాల దుఃఖపడింది. భరించలేని పరిస్థితుల్లో నిస్పృహతో ఆమె వైతి పట్టర్ అనే ఆశ్రితుడితో, కృష్ణన్ అనే పనిపిల్లవాడితోనూ ఇల్లువిడిచి పోతుంది. కాశీ చేరుకొని అచ్చట కొంత కాలం ఉండాలని నిశ్చయించుకొంటుంది. అక్కడ ఉన్న కాలంలోనే ఉత్తర భారతంలో ప్రసిద్ధుడైన, పైకి వస్తున్న చిత్రకారుడు రామన్‌మీనన్‌ను ఆమె కలుసుకొంటుంది. కళ్యాణికుట్టి అమ్మ

అంత ధనిక భూస్వాములు కాకపోయినా ప్రాచీనులూ, పేరు ప్రతిష్ఠలున్న థెక్కిల్లత్ అనే మలబారు తార్వాడ్‌కు చెందినవాడు రామన్‌మీనన్. బ్రతుకు తెరువుకు ఏదో ఒక వృత్తిని నేర్చుకోవడానికై అతను ఇల్లు వదలి వచ్చాడు. చిత్రలేఖనాన్ని అభ్యసించి ఉత్తర భారతంలో పనిచేయడం ప్రారంభించి మంచి పేరు ప్రతిష్ఠలూ, డబ్బూ సంపాదించాడు.

ఈ విధంగా కళ్యాణిఅమ్మ, రామన్ మీనన్‌లు కలుసుకొన్నారు. త్వరలోనే వివాహం చేసుకొన్నారు. ఆ సమయంలో వైతిపట్టర్ కళ్యాణి అమ్మను విడిచిపెట్టి మలబారు చేరుకొన్నాడు. అతను విలన్ లాగా కనిపిస్తాడు. విలన్ కూడా. కల్యాణిఅమ్మతో కలసిపోవడంవల్ల ఏదోవిధంగా, ఎక్కడో ఓ చోట ఆమె నగల్నీ, డబ్బునీ దొంగిలించి ఆమెను విడిచి పోవచ్చునని ఆశపడ్డాడు.. కాని ఆమె రామన్‌మీనన్‌ను కలసికొని వివాహం చేసుకొన్న తరువాత తన పథకం పారదని తెలుసుకొని ఆమెను విడిచిపెట్టి వెళ్ళాడు. వాళ్ళకు ఒక అమ్మాయి పుట్టింది. ఆ పాపకు 'శారద' అని పేరు పెట్టారు. రామన్‌మీనన్ ఇలా భార్యాబిడ్డలతో సుఖంగా జీవిస్తూ ఉండగా అతనికళ్లకేదో జబ్బుచేసి అతను చిత్రలేఖన వృత్తిని విడిచిపెట్టవలసి వస్తుంది. అదే సమయంలో అతను డబ్బు దాచుకొన్న బ్యాంకు దివాలా దీస్తుంది. ఈ రెండు దెబ్బలూ తగలడంవల్ల తల్లడిల్లిన రామన్‌మీనన్ కుటుంబం దక్షిణ భారతదేశంలో తీర్థయాత్రలు చేస్తూ రామేశ్వరం చేరుకొంటారు.

రామన్‌మీనన్ ఉత్తర భారతదేశం వెళ్ళక పూర్వమే శంకరన్ 8 ఏళ్ళ వయసులోనే అతనివద్ద చిత్రలేఖనం నేర్చుకోవడానికై చేరి ఎల్ల వేళలా ఆతనితోనే ఉన్నాడు. ఇప్పుడతను 21 సంవత్సరాల నవ యువకుడు. రామన్‌మీనన్ తన కుమార్తెకు శంకరన్ చాల విధేయుడని, తెలివి తేటలు గల యువకుడనీ, పనికివచ్చే స్నేహితుడనీ, అవసర సమయాలలో ఆధారపడదగిన వాడనీ చెప్తాడు.

భార్య హఠాన్మరణం అనే మూడవ దెబ్బతో చకితుడైన రామన్ మీనన్‌కు ఏమి చేయాలో పాలుపోలేదు. భవిష్యత్తుకై మంచి నిర్ణయాలు తీసికోవడానికి తన మనస్సు సరిపోయినంత తేలికయ్యేంతవరకూ రామన్ మీనన్ రామేశ్వరంలోనే ఉన్నాడు. ఒకరోజు అనుకోకుండా శంకరన్

రామేశ్వరానికి వచ్చిన వైతిపట్టర్‌ను కలుసుకొంటాడు. వైతిపట్టర్ కృష్ణన్‌ను గూడా కలుసుకొని అతన్నుండి రామన్‌మీనన్ కుటుంబాన్ని గూర్చిన అన్ని వివరాలు రాబట్టుతాడు. కల్యాణిఅమ్మ, రామన్‌మీనన్‌లను వైతిపట్టర్ ఉత్తరభారతంలో వదిలివేసిన తరువాత అనేక సంవత్సరాలకు జరిగిన సంగతిది. వివరాలన్నీ సేకరించిన తరువాత అతని బుర్ర వేగంగా పనిచేయసాగింది. అతను రామన్‌మీనన్‌వద్దకు వచ్చి కల్యాణిఅమ్మ తార్వాడ్ సంగతులు చెప్పి దాని సంపదను, అంతస్థును వివరిస్తాడు. రామన్‌మీనన్ క్రూరుడైన కారణవన్ గూర్చి, తార్వాడ్ ఇతర సభ్యులను గూర్చి విన్నాడు. కల్యాణిఅమ్మ చెల్లెలు లక్ష్మి భగ్న హృదయంతో మరణించిందని తెలుసు కొంటాడు. ఆమె ధనికుడూ, గౌరవనీయుడు అయిన ఉదయం థాలి ఎస్టేటు భూస్వామి రామవర్మ తిరుముల్పాద్‌ను వివాహం చేసుకొన్నది. కాని కొప్పున్‌అచ్చన్ అతనితో పోట్లాట పెట్టుకొని లక్ష్మిఅమ్మ. అతన్ని కలుసుకో కుండా నిరోధించాడు. అది ఆమెకు మరణాంతకమైన అసంతృప్తిగా అయింది. తార్వాడ్‌లో మరో స్త్రీ గూడా ఉంది కాని వివాహం అయి ఎన్నో సంవత్సరాలైనా సంతానం లేదు. ఇక కలిగే అవకాశం గూడ లేదు. కాబట్టి మరుమక్కదాయం చట్టాన్ననుసరించి, తార్వాడ్ అంతరించకుండా కాపాడే ఏకైక కారణంగా పూంచోలక్కార ఎస్టేటును శారద చాలా ముఖ్యమైన వారసురాలవుతుంది. తన భార్యను గూర్చిన ఈ సమాచారమంతా విన్న తరువాత రామన్‌మీనన్ మలబారుకు తిరిగి రావడానికి నిశ్చయించు కొంటాడు. కొద్ది రోజుల్లోనే కుటుంబం అంతా రామేశ్వరం విడిచిపెట్టి మల బారుకు చేరుకొని వైతిపట్టార్ ఆహ్వానం మీద తాత్కాలికంగా అతని ఇంట్లో నివాసం ఏర్పరచుకుంటారు.

కొద్ది రోజుల తర్వాత రామన్‌మీనన్ శంకరన్‌కు ఒక ఉత్తరం ఇచ్చి కొప్పున్నిఅచ్చన్ వద్దకు పంపుతాడు. అందులో కల్యాణిఅమ్మ రామేశ్వ రంలో మరణించిందనీ, ఆమెకు శారద అనే ఒక కూతురు ఉందనీ చెప్తాడు. తనకు వాళ్ళలో ఉన్న సంబంధాన్ని, తనకు కొద్ది కాలంలో జరిగిన దురదృష్ట సంఘటనలనూ, అవి ఏవిధంగా శారదను ఆమె అంతస్తుకు తగి నట్లు పెంచడానికి తనను అశక్తుణ్ణి చేశాయో వివరించాడు. ఆ సమయంలో శారద ఎటువంటి దురదృష్టకరమైన పరిస్థితుల్లో ఉందో చెప్తూ ఆమె భవి

ష్యత్తు సానుభూతిపరుడూ, ఉదారుడూ అయిన అచ్చన్‌పై ఆధారపడి ఉందని తెల్పుతాడు. చివర్న ప్రసిద్ధ పూంజోలక్కార తార్వాడ్ సభ్యురాలుగా శారదను ఎట్లా పెంచాలో నిర్ణయించవలసిందిగా అచ్చన్‌ను అభ్యర్థించాడు.

తన పదవి, ప్రతిష్ఠననుసరించి కొప్పున్నిఅచ్చన్ స్వయంగా ఉత్త రాన్ని స్వీకరించడంకాని, చదవడంకాని చేయడు. అతని గుమస్తా చదివి వినిపిస్తాడు. రామన్‌మీనన్ వ్రాసిందంతా విని అంతా మోసం అను కొంటాడు. ఒక అజ్ఞాత వ్యక్తి కుటుంబాన్ని అవమానపరుస్తూ ఇటువంటి అర్థరహితమైన హక్కుల్ని చూపించడం అతన్ని నిశ్చేష్టుణ్ణి చేసింది. నౌకర్లూ, ఎప్పుడూ కారణవన్ చుట్టూ ఉండే పనిలేనివాళ్ళూ (ఇతర్ల పనుల్లో జోక్యం చేసుకొనేవాళ్లు) ఈ ఉత్తరంలోని విషయాలను వినడం మరీ అవమాన కర మనిపించింది. కొప్పున్నిఅచ్చన్ ఆగ్రహావేశంతో అరిచాడు. ఈ ఉత్తరం తెచ్చిన కుక్కను పట్టుకోండి. వాణ్ణి తన్నండి, ఎముకలు విరగ్గొట్టండి. నిజాయితీ, గౌరవాలతో కూడిన జీవితాలు గడిపే వ్యక్తుల కీర్తి నెట్లా చెడగొడ్తున్నాడో చూడండి'' అని. దీన్ని విన్న శంకరన్ కొప్పున్ని అచ్చన్ నౌకర్లు తనకోసం వెతుకుతుండగానే కాలికి బుద్ధిచెప్పాడు. ఇంతలో అచ్చన్ స్వయంగా అనందరవన్ రాఘవన్ ఉన్నితో పరిస్థితిని చర్చించి సలహాకై వైతిపట్టార్‌కు కబురంపించాడు

శంకరన్ పూంజోలక్కారనుండి పారిపోతూ అచ్చన్ అనందరవన్ లలో ఒకడైన కృష్ణన్ ఉన్ని అనే సందేశవాహకుణ్ణి కలుసుకొన్నాడు. ఇతను సత్పురుషుడు. కల్యాణి అమ్మపై పూర్తి సానుభూతి కలవాడు. అతను అసలు శారద నిజంగా కల్యాణి అమ్మ కుమార్తె అవునోకాదో తెలుసు కొని ఐనట్లయితే ఆమెకు సహాయం చేయాలనుకున్నాడు. శంకరన్ త్రోవలో శంకువారియర్‌ను గూడ కలుసుకొన్నాడు. ఈయన కాశీలో రామన్‌మీనన్, కల్యాణి అమ్మ, శారదలను కలుసుకున్నవాడు.

ఇంతలో కుంచన్‌మీనన్ అనే స్థానిక వ్యసనపరుడి[1] ద్వారా శారద, ఆమె తండ్రి పొరుగునే ఉన్నారని రామవర్మ తిరుమూల్పాద్ తెలుసు కున్నాడు. అచ్చన్, తిరుమూల్పాద్‌ను అనవసరమైన వ్యాజ్యోలలోదించి అతనికి డబ్బు ఖర్చు అయ్యేటట్లు, ప్రతిష్ఠకు భంగం కలిగేటట్లు చేశాడు. అన్ని

1. ఇలాంటి నోటి దురదగాళ్లను చందుమీనన్ చక్కగా వర్ణించాడు.

కేసుల్లోను తన నేర్పువల్ల అచ్చనే గెలిచేవాడు. అచ్చన్ తప్పుడు కేసులు పెట్టి తిరుమూల్పాద్ నుంచి కొంత దేవాలయం ఆస్థినీ హక్కుల్నీ సంపాదించాడు. కౌలుదారులు ఎదురు తిరిగేటట్లుగా చేసి కొంత ఆస్థిని తరిగిపోనిచ్చాడు. తిరుమూల్పాద్ కుటుంబంలోని ఇద్దరు స్త్రీలను వివాహం చేసుకొన్న ఇద్దరు నంబూద్రిలను భయపెట్టి పారిపోయేటట్లుచేసి అవమానించాడు. ఇంకా ఎన్నో విధాల తిరుమూల్పాద్ ప్రతిష్ఠను భగ్నం చేశాడు. ఇది ఎడతెగని పీడిత అవమానాల కథ. అచ్చన్ తిరుమూల్పాద్‌నూ అతని భార్యనూ (శారద చిన్నమ్మ) వేరు చేశాడు. ఈ వేర్పాటు కారణంగా ఆమె క్రుంగి కృశించి మరణించింది. ఈ అనుభవాలను తిరుమూల్‌పాద్ మరచిపోలేకపోయాడు. కొప్పున్ని అచ్చన్‌పై పగదీర్చుకోవడానికి అవకాశాలకై ఎప్పుడూ ఎదురు చూస్తునే ఉన్నారు. కుందన్ మీనన్‌కు ఈ విషయం తెలుసు. తన తగాదల మారి వృత్తికి తగ్గట్లుగానే తన ప్రత్యర్థిపై విజయం సాధించమని ఇపుడే సరైన అవకాశం వచ్చిందనీ తిరుమూల్‌పాద్‌కు సలహా ఇచ్చాడు. శారద, ఆమె తండ్రి వైతిపట్టార్ ఇంట్లో ఉన్న సంగతి గూడ కుందన్ మీనన్‌కు తెలుసు. వైతిపట్టర్‌ను చేజిక్కించుకొని శారదను, ఆమె తండ్రినీ తన ఇంటికి తీసుకొని రావలసిందిగా తిరుమూల్పాద్, కుందన్ మీనన్‌ను కోరాడు.

రామన్ మీనన్ తన లేఖకు సమాధానంకోసం ఎదురు చూస్తుండగా వైతిపట్టర్ పథకం వేసుకొంటున్నాడు. రామన్ మీనన్ వల్లనే తాను కల్యాణి అమ్మను దోచుకొనడానికి వీలులేకపోయిందన్న విషయం వైతిపత్తర్ మరచిపోలేదు. రామన్ మీనన్ దగ్గర ఎంతో డబ్బు, ఎన్నో నగలూ ఉన్నాయని అతని నమ్మకం. కాలం కర్మం కలసి వచ్చినపుడు రామన్ మీనన్ డబ్బూ, బంగారమూ కాజేయాలని పథకం రూపొందించుకొన్నాడు. కాని రోజులు గడిచేకొద్దీ విశ్వాసపాత్రుడూ, జాగరూకుడూ అయిన శంకరన్ శారద, రామన్ మీనన్‌లతో ఉన్నంతకాలం వారికేవిధమైన కీడూ చేయలేనని తెలుసుకొన్నాడు. అందువల్ల పట్టర్ తనకంటే దుర్మార్గుడయిన వేరొకడిచేత ప్రాణాంతకమైన విషాన్ని తయారుచేయించి శంకరన్ తాగే పాలలో వేసేటట్లుగా పని పిల్లవాడు కృష్ణన్‌తో ఒప్పందం కుదుర్చుకున్నాడు. అయితే రామన్ మీనన్‌ను చూడటానికి వచ్చిన ఒక నంబూద్రి యువకు డా పాలు త్రాగి మరణిస్తాడు. వాస్తవానికి నంబూద్రి దురదృష్టం

వెంటరాగా శారద అసాధారణ సౌందర్యాన్ని చూడాలని వచ్చాడు. పట్టర్ చేతిలో కీలుబొమ్మ అయిన కృష్ణన్ వెంటనే అతని ఆజ్ఞ నమసరించి పాత్రలన్నీ శుభ్రంగా కడిగివేశాడు. వైతిపట్టార్ నంబూద్రి కలరా వల్ల మరణించాడని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ త్వర త్వరగా శవాన్ని పూడ్చి పెట్టడానికి ప్రయత్నాలు చేస్తాడు ఈ విధంగా తన నీచమైన నేరాన్ని వెల్లడించే ఆధారాలను నాశనం చేయాలని సంకల్పించాడు.

రామన్ మీనన్, శంకరన్‌లు పెద్దగా అనుమానించలేదు. అయినా శారదతో నివాసం మార్చారు. వాళ్ళ శ్రేయస్సును కోరుతున్నట్లుగా నటిస్తూ, తన కోర్కెల పెంచుకొంటూ వాళ్ళచుట్టూ తిరుగుతూనే ఉన్నాడు వైతిపత్తర్. తిరుమూల్పాద్ మనుష్యులు హఠాత్తుగా వచ్చి శారదను, ఇతరుల్ని అతని ఇంటికి తీసుకొని వెళ్ళడంతో వైతిపత్తర్ ఆశలు పటాపంచ లయ్యాయి. వైతిపట్టర్ చురుకుగా ఆలోచించి రామన్ మీనన్, శారదల నుండి అడుక్కోవడం ద్వారాగాని, కల్లబొల్లి ఏడ్పుల ద్వారాగాని కొంతడబ్బు నగలూ లాగాలనుకొన్నాడు.

తిరుమూల్పాద్ శారద, మీనన్‌లకు ఆశ్రయం ఇచ్చాడని కొప్పున్ని అచ్చన్ రాఘవన్ ఉన్ని ద్వారా విన్నాడు. ప్రతిభాశాలియైన రాఘవన్ ఉన్ని కుమారుడు కృష్ణన్ ఉన్ని రామన్‌మీనన్ లేఖకు సరైన సమాధానం రాసి పంపమని సలహా ఇస్తాడు. ఏ విధమైన సమాధానమూ రాకపోతే రామన్ మీనన్ కేసు పెట్టవచ్చునని చెప్తాడు. అచ్చన్ వెంటనే మరో తగవుల మారి తాస్సన్ మీనన్‌ను వాళ్ళ పాత వకీల్లు కర్పూర అయ్యర్, సాము మీనన్‌లను తీసుకోవలసిన చర్యవిషయమై సలహా తీసుకరమ్మని పంపుతాడు. వాళ్ళు అప్పుడు వకీళ్ళ క్లబ్బులో ఉన్నారు. దాని ప్రసిద్ధమైన వర్ణన పుస్తకంలో ఉంది. అక్కడ ఏదీ పూర్తిగా చక్కగాలేదు. పైకప్పుకు చిల్లు లున్నాయి. చుట్టూ గోడల్లేవు. కాళ్లు మొదలగు ఇతర భాగాలన్నీ పూర్తిగా ఉన్నా మంచి కుర్చీగాని, బల్లగాని ఒక్కటీలేదు. అయినా కొంతమంది వకీళ్ళక్కడ సాహిత్యాన్ని గూర్చి చర్చిస్తున్నారు. ఈ వకీళ్ళ మాటల ద్వారా నవలల గూర్చి, కొంతమంది సమకాలీన రచయితలు సంస్కృతీక రింపబడి మలయాళాన్ని ఉపయోగించడం గూర్చిన అభిప్రాయాలను చందు మీనన్ వెల్లడించాడు. రామన్ మీనన్ లేఖకు కృష్ణమీనన్ తయారుచేసిన

సమాధానాన్ని రామన్ మీనన్‌కు పంపవలసిందిగా కర్పూర అయ్యర్ సలహా ఇచ్చాడు. ఈ సమాధానంలో రామన్ మీనన్ తన లేఖలో రాసిందంతా అబద్ధమనీ, తార్వాడుకు అప్రతిష్టను తెచ్చే ప్రయత్నాన్ని దోచుకునే ప్రయత్నాన్నీ విరమించుకొనకపోతే అతనూ, అతని సలహాదారులూ బాధ పడాల్సి ఉంటుందనీ చెప్పబడింది.

ఒక వారం తరువాత కొప్పున్ని అచ్చన్‌కు రాఘవమీనన్ అనే వకీలు నుండి ఒక రిజిస్టరు లెటరు వచ్చింది. ఇందులో శారదను పూంజోలక్కర తార్వాడు స్త్రీ వారసురాలుగా అంగీకరించి పోషించాలనీ లేకపోయినట్లయితే ఈ విషయంలో కేసు పెట్టడానికి తనను నియమించడం జరిగిందనీ ఉంది. ఈ ఉత్తరం అచ్చన్‌కు కోపాన్ని, విచారాన్ని కలిగిస్తుంది. అతను వెంటనే వైతిపట్టార్‌ను, జ్యోతిష్కుడు ఛత్తుపణిక్కర్‌ను పిలిపించాడు. తాను అచ్చన్‌ను ఆనందపరచవలసి ఉంటుందని ఛాతుపణిక్కర్‌కు తెలుసు. నాటకీయంగా గ్రహాలు, నక్షత్రాలు విభజించి, పరిశీలించిం తర్వాత, అనేక ప్రమాణాలకు అర్థం చెప్పిన అధికారంవల్ల గ్రహాలు అచ్చన్‌కు చాల అనుకూలమైన స్థలాల్లో ఉన్నాయని, అతనీ తగాదాలో తప్పక గెలుస్తాడని ప్రకటిస్తాడు. అచ్చన్ ఛాతు పణిక్కర్‌ను సంప్రదించాడని విని తిరుమూల్పాద్ గూడా పణిక్కర్‌ను పిలిపిస్తాడు. తిరుమూల్పాద్‌కు కావలసిందేమిటో పణిక్కర్ గ్రహిస్తాడు. అతను అచ్చన్ ముందు చేసిన ట్రిక్కులే మళ్లా తిరుమూల్పాద్ వద్ద గూడ చేశాడు. ప్రమాణ గ్రంథాల నుదహరించాడు. సందర్భాను గుణంగా వాటికి మళ్లీ అర్థం చెప్పాడు. గ్రహాలూ, నక్షత్రాలూ అచ్చన్‌కు చాల వ్యతిరేకంగా ఉన్నాయని, తిరుమూల్పాద్ చాల అనుకూలంగా ఉన్నాయని, అతనికే విజయం తథ్యమనీ తిరుమూల్పాద్‌ను నమ్మించాడు. జ్యోతిష్కులు పనిచేసే తీరును చూచిన పాఠకులు ఈ సన్నివేశంలో వాస్తవికతను గ్రహించి ఆనందించగలరు.

కొప్పున్ని అచ్చన్ వైతిపట్టర్‌ను గూడ పిలిపించాడు. ఈ దుర్మార్గుడు తాను రామన్‌మీనన్ వద్దనుండి సంపాదించగలిగిందంతా సంపాదించాననీ, అతనికి విధేయుడుగా ఉండటంవల్ల ఇకముందు జరిగే లాభమేమీ లేదని, పైగా తను ఇక్కడి నుంచి అతన్ని వ్యతిరేకిస్తేనే తనకు లాభముంటుందనీ గుర్తించాడు. అతను వెంటనే అచ్చన్ ముందు విధేయత, సేవకత్వము

మూర్తీభవించిన వాడిగా హాజరయ్యాడు. పని పిల్లవాడు కృష్ణన్‌కు శారద యొక్క నిజమైన కథ పూర్తిగా తెలుసునని తెలిపాడు. కృష్ణన్‌ను పిలిపించారు. పట్టార్ చెప్పిన విధంగా అతను అచ్చన్‌కు ఒక అద్భుతమైన కథ చెప్పాడు. రామన్ మీనన్ యదార్థానికి రామస్ పిళ్లే అనే త్రివేంద్రం నివాసి అనీ, ఆతనికి ఉత్తర భారత దేశంలోని ఉజ్జయినిలో ఒక మహమ్మదీయవేశ్య ఉండేదనీ, రామన్ పిళ్లేతో కలవక ముందే ఆమెకు శారద అనే కూతురు ఉన్నదనీ, శంకరన్ ఒక త్రాగుబోతు, జూదరి అనీ ఈ కథ సారాంశం. శంకరన్ పథకం ప్రకారమే రామన్ పిళ్ళే శారదను కల్యాణి అమ్మ కూతురని చెప్పి తీసుకొని వచ్చి పూంజోలక్కరకు వారసురాలిగా చెయ్యదలచుకొన్నాడని చెపుతాడు.

అచ్చన్‌కు మండిపోయింది. తమ మధ్య ఒక మహ్మదీయ బాలికను పెట్టుకొని పోషించి మందిరాన్నీ, తటికాన్నీ, భవనాన్నీ కలుషితం చేయవద్దని హెచ్చరిస్తూ ఉత్తరం రాయాలనుకొంటాడు. సంప్రదింపుల తర్వాత శారద మహ్మదీయ బాలిక అవడానికి ఖచ్చితమైన ఆధారాలు దొరకక ముందే అట్లా సమాధానం రాయడం మంచిది కాదని కృష్ణమీనన్ సలహా ఇస్తాడు. తాను అటువంటి ఉత్తరం రాయ నిరాకరిస్తాడు.

అతని అభిప్రాయాన్ని మన్నించకుండా తిరుమూల్పాద్‌కూ, అతని నివాసంలో నివసిస్తున్న శారద మహ్మదీయ మతానికి చెందిన యువతిలని హెచ్చరిస్తూ ఉదయంతాళి ప్రాంతంలోని ఒక నంబూద్రి మతానికి రెండు ఉత్తరాలు వెళ్లాయి. ఈ ఉత్తరం ఉదయంతాళి ప్రాంతంలోని నంబూద్రీలలో కలవరం రేకెత్తించింది. తిరుమూల్పాద్ ఉత్తరం తీసుకొని రామన్ మీనన్, శంకరన్‌లను చూపించాడు. వాళ్లు నవ్వుకొన్నారు. వాళ్ళు కోరినట్లు శంకరన్ ఒక సమాధానాన్ని రాశాడు. ఈ లేఖ శారద, రామన్ మీనన్‌ల పాలెస్‌లో నివసించడం లేదని, వెలుపలెక్కడో ఉంటున్నారని, వారి ఖర్చుల్ని జమీ భరించడంలేదని, ఉత్తరంలో చేసిన ఆరోపణలు నిరాధారాలనీ, అసత్యాలనీ, ఆనాహూతాలనీ వివరించింది.

కుందన్‌మీనన్ శారద విషయాలను గూర్చిన అనుకూల, ప్రతికూల చర్చలు కూలంకషంగా రాఘవమీనన్‌తో చేస్తాడు. తనలాంటి చాలామంది లాగానే కేవలం ఒక్క మలయాళం మాత్రమే తెలిసిన కుందన్‌మీనన్

న్యాయ సంబంధమైన ఇంగ్లీషు పదాలను తప్పుగా పలుకుతాడు (ఘోరంగా మార్చివేస్తాడు). అతడు తన మహావిజ్ఞానాన్ని అందరికీ చూపించాలనే తాపత్రయంతో ఓటమి సంభవించినా వాదిస్తూనే ఉంటాడు. ఈ విధంగా రిల్లీయాక్ట్ (రిలీఫ్‌యాక్ట్), అలూప్పి (ఎలిబి), బోనప్పిట్ (బోనఫైడ్స్), లావిడెన్స్ (ఎవిడెన్స్), మెలప్పిట్టు (కూలఫైడ్స్), రీస్ ఇంద్రవలియమ్ చూడికెట్టు (రెస్ ఇంటర్ ఎలియాస్ ఎడ్ జుడికేట్) మొదలైన పదాలు అతని మాటల్లో ఉంటాయి. ఈ పదాల ఉచ్చారణవల్ల కలిగే హాస్యమే కాకుండా, ఇవి మలయాళ పదాలను పోలి ఉండటంవల్ల వచ్చే భిన్నార్థాలవల్ల మలయాళం తెలిసిన పాఠకులకు మరింత నవ్వు వస్తుంది. ఎందుకంటే మలయాళంలో 'పిట్టు' అంటే 'రొట్టె' అనీ, ఒక్కోసారి రొట్టెల పిండి అనీ అర్థం వస్తుంది. చూడికెట్టు అంటే త్రాటిచుట్ట, తిరుమూల్పాద్ కోరిక ప్రకారం కుందన్ మీనన్ కేసును రాఘవమీనన్‌కు, మాధవ మీనన్ అనే మరో సమర్థుడైన వకీలుకు అప్పగింవాడు. ఈ మధ్యకాలంలో శంకరన్, శంకు వారియర్‌ను కలుసుకొని శారద, కల్యాణి అమ్మల విషయంలో సాక్ష్యం ఇవ్వవలసిందిగా సూచిస్తాడు. శంకువారియర్ మొదట కొప్పున్ని అచ్చన్ అంటే గల భయం. సత్యం మీద ప్రేమ – ఈ రెండింట మధ్య తికమక లాడాడు. శంకువారియర్ తండ్రి గొప్ప పండితుడనే విషయాన్ని అతను కూడా పవిత్రతకూ, సత్యవాక్కుకూ ప్రసిద్ధి చెందడనే విషయాన్ని గుర్తుచేసి అచ్చన్ ఉన్నా, ఊడినా సత్యాన్ని చెప్పవలసిన అవసరాన్ని శంకరన్ నొక్కిచెప్తాడు.

ప్రత్యర్థుల్యిద్దరి మధ్యా ఉత్తరాల వినిమయమూ, న్యాయవాదుల మధ్య జరిగిన చర్చలూ అందరికీ తెలిసిపోతాయి. ఇద్దరి అనుయాయులూ తిరుమూల్పాద్, అచ్చన్‌ల మధ్య స్పర్ధలు మరింత పెంచడానికి శాయశక్తులా తిప్పలు పడ్డారు.

చందుమీనన్ శారద 11 అధ్యాయాలు రచించాడు. ఇద్దరు పాత శత్రువుల మధ్య న్యాయస్థానంలో జరిగే యుద్ధ పరాకాష్ఠకు చందుమీనన్ రంగాన్ని సిద్ధం చేశాడు. ప్రతి ప్రతిస్పర్ధి వెనుకా దీన్ని వేగవంతం చేయడానికీ, జరుగుతున్న విషయాలు జాగ్రత్తగా పరిశీలించడానికీ బంధువులు, వకీళ్లు, స్థాన భూతిపరులు, వంధిమాగధులు, అవకాశవాదులు తగాదాల

మారుల గుంపులను తన న్యాయస్థానానుభవాలనుంచి, వివాహసంఘం (Marriage Commission) నుంచి సిద్ధం చేసుకొన్నాడు చందుమీనన్.

అకస్మాత్తుగా అతనికి పైనుంచి పిలుపు వచ్చింది. వైతిపట్టర్, శారద మరి ఇతరులు ఏమయ్యారో, పూంచోలక్కార పదమ్ భవిష్యత్తు ఏమిటో మన ఊహాకే మిగిలి పోయింది.

మరణించే నాటికి చివరి ఘట్టాలను సిద్ధం చేస్తున్నంతవరకే కథను పూర్తిచేయగలిగాడు. న్యాయవాదులు కలుసుకొన్నారు. అభియోగం సిద్ధం అయింది. తర్వాత కొంతమంది కుతూకలం కలవాళ్లు శ్రీయుతులు సి. అంతప్పయ్, పి. గోపాలకృష్ణకురుప్, ఇంకా ఈ మధ్య పి. రాధాకృష్ణ మీనన్‌లు కథను పూరించారు. ఎంతవరకు వారి పాఠాలు చందుమీనన్ పథకాలతో సరిపోలుతాయో చెప్పలేం. ఆయనకు పక్షవాతపు దెబ్బ తగిలిం తర్వాత అసంపూర్తి నవల రాయడానికి సిద్ధంచేసుకొన్న నోట్సును నాశనం చేశాడని ఒక కథ ఉన్నది. బహుశా ఆయన వాటిని అపార్థం చేసుకోవడాన్ని, తప్పుగా ఉపయోగించడాన్ని ఇష్టపడి ఉండడు. చందుమీనన్ నెలకొల్పిన ప్రమాణాలను చేరుకోవడం ఒక్క అసాధారణ ప్రతిభాశాలులకు మాత్రమే సాధ్యమౌతుందని సాహిత్య విమర్శకుల అభిప్రాయం.

# 7

# శారద - ఒక పరిశీలన

శారద నవలను పరిశీలించటం అంటే అనిశ్చితి మార్గంలో ప్రవేశించటమే. చందుమీనన్ మనకు మూడోవంతు కథను మాత్రమే అందించాడు. అందువల్లనే కథ ఎట్లా కొనసాగి ఉండేదో పాత్రలు పాత్రల ప్రవర్తనతీరు ఎట్లా ఉండేదో మనకు తెలియదు. చందుమీనన్ చెప్పిన దాన్ని వ్యాఖ్యానించడం, ముందేమి చెప్పేవాడో ఊహించడం మాత్రమే మనం చేయ

గలిగింది. 'శారదపై వ్యాఖ్యానాలు చేయటానికి బదులుగా దాన్ని గురించి బాధపడతాము' అని శ్రీ M. P. పాల్ తన "నవలా సాహిత్యం"లో చెప్పాడు. ఎందుకంటే చక్కగా మొదలైన కథను చందుమీనన్ పూర్తి చేయ లేకపోయాడు.

కథా నాయిక తల్లి అకాల హఠాన్మరణం అనే దుఃఖోదంతంలో నవల మొదలౌతుంది. ఆనాటికి కథానాయిక శారద వయస్సు 12 సంవత్స రాలు మాత్రమే ఆమె తండ్రి వృత్తి, సంపాదన కోల్పోవడంతో ఇద్దరూ అసహాయస్థితిలో అపరిచితులుగా రామేశ్వరం చేరారు.

కథ సాగుతూంటే కృష్ణన్, శంకరన్, వైతిపట్టర్, కొప్పున్ని అచ్చన్, ఛత్తుపణిక్కర్, కుందన్ మీనన్, కృష్ణమీనన్‌లాంటి కొత్త పాత్రలు మనకు పరిచయమవుతూంటాయి. శబ్దచిత్రాలలో ఇందులేఖలో పాత్రలు సృష్టించినట్లే, పాత్రపోషణలో చందుమీనన్ ఔచితిని, పనితనాన్ని ఈ కథలో గూడ చూడవచ్చు. శారద బాలిక మాలియనా కూడా దేవతా సౌందర్యాన్ని, స్వభావాన్ని సంతరించుకుంది. ఆమెను వర్ణించడంలో మీనన్ కవితాపరమైన భాషను ఉపయోగించాడు. ఆమె అసాధారణ సౌందర్యాన్ని గూర్చి పాఠకునికి చెప్పడానికి మూడు పేజీలు ఉపయోగిం చాడు. ఆమె అద్భుత సౌంద్యం సుగంధ సౌరభ పరిమళ భరితం. ఆమె పరిపూర్ణ వయస్కురాలైయ్యేటప్పటికి ఇంకా మరింత ఆకర్షణీయంగా రూపొందుతుందని భావించాడు. "దిన దిన ప్రవర్ధమానమవుతూ, పరి పూర్ణత సంతరించుకొంటున్న ఆమె సౌందర్యానికి దీవెనలిచ్చేవారికి నివా ళులు. అంతవరకూ ఆమె తన కాంతితో లోకాన్ని సమ్మోహితం చేస్తుంది" అని అంటాడు.

శారదలోని కృష్ణమీనన్ పాత్రను ఇందులేఖలోని మాధవన్ పాత్రకు సాటిగా రచయిత మలచాడు. కృష్ణమీనన్ శారీరక, బౌద్ధిక యోగ్యతలను చెప్పడానికి కొన్ని పేజీలే కేటాయించాడు. అతడి ప్రవర్తన ఆదర్శప్రాయ మైంది. ఉన్నత విద్యార్హతలు గల వర్ధమాన న్యాయవాది.

కొప్పున్ని అచ్చన్ పూంజోలక్కా రపదమ్‌కు చెందిన దురుసు, నిరంకు శత్వ, కుట్ర ధోరణులు గల ధనికవర్గానికి చెందిన సంపన్న తార్వాడ్ కారణవన్. ఇందులేఖలోని పంచుమీనన్ పాత్రవలె ఇతని స్వభావంలో

ఏవైనా పశ్చాత్తాప ఛాయలూ, హృదయకోశంలో ఏ మూలైనా మృదుత్వం ఉన్నాయో లేదో కథ అసంపూర్ణం కావడంవల్లం సరిగ్గా చెప్పలేం.

వైతిపట్టర్ కేవలం ధనాశాపరుడు, పరమ దుర్మార్గుడు. వైతిపట్టర్ రూపంలోని కొన్ని లక్షణాలను చెప్పి, అతని వక్రబుద్ధిని మనం తెలుసుకొనే టట్లుగా చందుమీనన్ చిత్రీకరించాడు. అతను చూడ్డానికి అందవికారంగా ఉంటాడు. అతడు సిరా లాగ నల్లగా ఉంటాడు. అతని తల వెనుకవైపు సన్నని, పొడవైన చిన్న తెల్లని పిలక జుట్టు ఎలుక తోకవలె ఉండేది. ముసలి తనంవల్ల పళ్లన్నీ ఊడిపోయి, ఉన్న మూడు నాలుగు పళ్లూ నోటినుండి బయటకు వచ్చిఉంటాయి ఆ పళ్లు అతనికన్నా కూడా కనిపిస్తాయి. ఇతర్లకు గూడా అతని కోరపళ్లు అసహ్యంగా కనిపిస్తాయి. కళ్ళు గుంతలో ఉన్నట్లు లోతుగా ఉంటాయి. కాని అప్పుడప్పుడు త్రాచుపాము కళ్లలాగ మెరుస్తూ ఉంటాయి. అతడు దేన్నైనా తీక్ష్ణంగా చూచినప్పుడు, ఆవేశంగా మాట్లాడే టప్పుడు, తీవ్రంగా ఆలోచించినప్పుడు, ఆశ్చర్యంగాని ఆనందంగాని పొంది నప్పుడు కళ్లలో ఈ జీరలు కన్పిస్తాయి. అప్పుడు కనుగుడ్లు ముందుకు తోసుకవచ్చి, పెద్ద కనుపాపలు బయటికి పొడుచుకొనివచ్చి ముక్కుకు రెండువైపులా దగ్గరగా వస్తాయి. సామాన్యంగా ఈ కళ్లు నిర్జీవాలు కాని పైన చెప్పినట్లు ఇటువంటి సందర్భాలలో అతని ముఖం బీభత్సంగానూ, క్రూరం గాను కన్పించేది. చూసేవాళ్ళకు భయాన్ని కలిగించేది. పడగ పూర్తిగా విప్పి బుసలు కొడుతూ కాటువేయడానికి సిద్ధంగా ఉన్న త్రాచుపాములాగ ఉండేవాడు. అతని శరీరం వంగి, కుంచించుకొని, ఎండిపోయిన చెట్టు కొమ్మను జ్ఞాపకం చేస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే వికృత పిశాచంలా ఉంటాడు. ఇదీ వైతిపట్టర్ స్వరూపం.

జ్యోతిష్కుడు ఛాతుపణిక్కర్ మరొక ఆసక్తికరమైన పాత్ర. కొప్పున్ని అచ్చన్, రామవర్మ, తిరుమూల్పాడ్‌లు అతని మాటలకు చాలా ప్రాధాన్యం ఇచ్చారు. కాని ఎవరిదగ్గర వాళ్ళ మాటలు మాట్లాడిన విధానాన్ని చూపి చందుమీనన్ మనకు నవ్వు పుట్టిస్తాడు. కొప్పున్నిఅచ్చన్, తిరుమూల్పాడ్ లకు జ్యోతిష్యం మీద నమ్మకం ఉంది. ఛతుపణిక్కర్‌ను ఇద్దరూ గుడ్డిగా విశ్వసించారు. ఛాతుపణిక్కర్ భవిష్యద్వాణిని పలికే తీరు కొప్పున్నిఅచ్చన్, తిరుమూల్పాడ్‌లను మంత్రముగ్ధులను చేస్తుంది. కాని మనల్ని నవ్విస్తుంది.

తగాదాలో తిరుమూల్పాడ్ మీద అచ్చన్ గెలుస్తాడని అచ్చన్‌ని, అచ్చన్ మీద తిరుమూల్పాద్ గెలుస్తాడని తిరుమూల్పాద్‌ను నమ్మించడానికి అతని దగ్గర తెలివైన ప్రశ్నలు, అంతకంటె తెలివైన సమాధానాలు ఉన్నాయి. ఇద్దరివద్దా మంచి బహుమానాలు పొంది అదృశ్యమవుతాడు శారద మొదటి భాగంలో. అతను వెళ్ళిపోయేటప్పుడు గ్రీకు బృందగానాలలో లాగా చందు మీనన్ ఈ విధంగా నీతి చెప్తాడు "నేనీ వెధవనుగూర్చి ఇంకేమి రాయను. తన మోసకారి వృత్తి ద్వారా ప్రజల్ని మంత్రముగ్ధుల్నిచేసి నా దేశస్థుల నుంచి 'ఇష్టంవచ్చినట్లు ధనం పిండుకోనీ."

చందుమీనన్ ఈ కథలో ప్రవేశపెట్టిన ఒక విచిత్రమైన పాత్ర కుందన్‌మీనన్. అతను కోర్టుపక్షులు అనే వర్గానికి చెందిన నశుస్తున్న వార్తా చిత్రంలాంటి వాడు. ఇది మీనన్ అద్భుతమైన శబ్ద చిత్రాలలో మరొక స్పష్టమైన వర్ణన. "సక్రమంగా నిలకడగా ఒక ప్రభుత్వోద్యోగం, వ్యాపారం, వ్యవసాయం, కుటుంబ యజమాన్యం, అధ్యాపకత్వం, చేతి పనులు, కూలి, తీర్థయాత్రలు, అడుక్కోవడం మొదలైనవాటిల్లో ఏదో వృత్తిని అవలంభించకుండా, కోర్టు తగాదాలవల్ల అపారమైన అనుభవాన్ని గడించి తాగాదాల పిచ్చివల్ల ఏమైనా ఆస్తి ఉంటే దాన్నంతా హారతి కర్పూరం చేసుకొని, కేసులు నడపడంలో వకీళ్ళకు సలహాదారుడుగా పోజులుకొడుతూ కొన్ని పరిభాషాపదాలు, పదబంధాలు నేర్చుకొని; పిటీషన్లు, డాక్యుమెంట్లు, కుటుంబ ఒప్పందాలు వ్రాయడంలో మహా నిపుణుడుగా అమాయకుల్ని నమ్మించేవాడికి స్థానిక కోర్టు పక్షి అని పేరు పెట్టాను. ఇతని కార్యకలాపాలు సాధారణంగా పెద్ద ధనిక కుటుంబాల్లో కలతలుతెచ్చి అనవసరమైన తగాదాలకు దారితీసి సర్వనాశనం తెస్తాయి," కుందన్‌మీనన్ అటువంటి కోర్టుపక్షి. తన వృత్తికి సంబంధించిన కార్యకలాపాలవల్ల స్వంత తార్వాడ్‌ను నాశనంచేసుకొని నిరాశ్రయుడయ్యాడు. అయినా శుభ్రమైన పంచతో, భుజాలమీద కండువాతో, పాత అరిగిపోయిన చెప్పులతో వంకరతిరిగి వెలిసిపోయిన పాత సిల్కు గొడుగుతో అన్ని వేళలా కన్పిస్తాడు. వృద్ధాప్యంలో గూడ ఆకారంలో గర్వం మాటల్లో తీవ్రత కన్పిస్తుంది. పరువు పోతుందనే భయంతో తన పేదరికాన్ని ఎవరి ముందూ వెల్లడవనిచ్చేవాడు కాడు. ఎవరైనా ఆమాట ఎత్తితే మండిపడేవాడు

ఇందులేఖలో లాగానే శారదలోగూడ చందుమీనన్ నంబూద్రిలను హేళనచేయటానికే ప్రవేశపెట్టాడు. శారద ఒక మహమ్మదీయ వేశ్యకూతు రని ఉత్తరం వచ్చినపుడు అందోళన పడుతున్న ఒక నంబూద్రీల గుంపును చూపించాడు. వాళ్ళంతా ఉత్తరం చదువుతున్న నంబూద్రి చుట్టూ జేర తారు. వాళ్ళంతా పూర్తిగా రాకపోయినా దాదాపు నగ్నంగా ఉన్నారు. కొంతమంది ప్రార్థనలు ఆపి సమాచారం వినటానికి పరుగెత్తుకొచ్చారు; కొంతమంది స్నానానికి పోబోతూ ఆగిపోయారు; కొంతమంది మరుగు దొడ్లలోనుండి అప్పుడే బయటకు వచ్చారు. కొంతమంది స్నానానికి సిద్ధ మవుతూ వంటికి నూనె పట్టించుకున్నారు. కొంతమంది తమలపాకులు నములుతూ వచ్చారు. మధ్యమధ్యలో పెద్దగా వ్యాఖ్యానిస్తున్నారు. ప్రశ్న లడుగుతున్నారు. ఉత్తరం చదువుతున్న పెద్ద నంబూద్రి చుట్టూ గంతులు వేస్తున్నారు.

వ్యక్తుల వర్ణనలేకాక ఇందులేఖలోనూ, శారదలోనూ అక్కడక్కడా స్థలాల వర్ణనలు గూడ కన్పిస్తాయి. ఇందులేఖతో పూవల్లి తార్వాడ్, దానికి సంబంధించిన ఆస్తుల వర్ణనేకాక, బొంబాయి రేవు, దాని పరిసరాల ప్రశంసా పూర్వకమైన వర్ణనా, అమరావతి వర్ణనా, మాధవన్‌కు కలకత్తాలో పరిచిత మైన సేన్‌ల వైభవోపేత గృహవర్ణనా ఉన్నాయి. శారదలో జమీందారీ తార్వాడ్ పూంభోలక్కాన్ ఏదమ్, దాని ఆస్తుల వర్ణనా, తిరుముల్పాద్ భవ నమూ, జనంతో సమ్మర్దమైన పట్టణ వర్ణనా ఉన్నాయి. గుళ్ళూ, ఇళ్ళూ, ఆఫీసుల మధ్యగా ఒకచోట ఒక వకీళ్ళ క్లబ్బుంది. అది ఒక ఘోరమైన స్థలం. కాని చందుమీనన్ రమ్యవర్తన మూలంగా దానికి మలయాళ సాహి త్యంలో ఒక స్థానం లభించింది. నేను దాన్ని అనువదించడానికి ప్రయత్ని స్తాను. ఇది శిథిల భవనం. దాని తూర్పుగోడ చాలాకాలం క్రిందట పడి పోయింది. అయినా ఇటుకలు, సున్నం ఇంకా పడిఉన్నాయి. పడిపోయిన గోడ స్థానంలో గాలి, వానలనుండి రక్షణ కోసం కొబ్బరి ఆకులతో అల్లిన చాప వేలాడుతోంది. క్లబ్బులోకి రావడానికి దీనిని ఎత్తవలసి ఉంటుంది. ఈ భవనం కట్టక ముందుకంటే ఇప్పుడే కాంతివంతంగా ఉంది. తరువాత పెట్టిన పెద్ద పెద్ద కిటికీలవల్ల కాంతి ఎక్కువైందని నా పాఠకులు అనుకుంటా రేమో, కారణం అదికాదు. కప్పు బాగుచేయించడానికి చందాలు రాకపోవడం వల్లనైన కప్పిన ఫలకలు పాతబడి చీకిపోయి బొక్కలు పడటంవల్ల వాటిల్లో

నుంచి బోలెడంత సూర్యకాంతి గదిలో ప్రవేశిస్తుంది. గదిలో ఉన్న వకీళ్ళు సూర్యకాంతి కిరణాల బారినుంచి తప్పించుకోవడానికి తలలమీద తువ్వాళ్ళు కప్పుకొన్నారు వాళ్ళు కప్పులోనుంచి వచ్చే వేడికిరణాలనుకూడ లెఖ్ఖచేయ కుండా తీవ్రపఠనం చేస్తున్నట్లు కన్పిస్తారు. గది మధ్యలో ఒక బల్ల ఉంది. దానికి మూడు కాళ్ళు మాత్రమే ఉన్నాయి. అది కొత్త ఫాషనేమీ కాదు. పాత పద్ధతికి చెందిన నాలుగు కాళ్ళ జాతికి చెందినదే. కాని ఒక కాలు అదృశ్య మయ్యింది. బల్ల సరిగా నిలబడటానికి కొన్ని ఇటుకలు, చెక్క ముక్కలు నాలుగో కాలుగా పనిచేస్తున్నాయి. ఒక వకీలు పడిపోయిన తలుపు చెక్క మీద కూర్చున్నాడు. ఒక ప్రసిద్ధ న్యాయవాదికి మంచి సీటు దొరికింది. దీన్ని ఇంగ్లీషులో 'ఈజీఛైర్' (పడక కుర్చీ) అంటారు. నిజం చెప్పాలంటే ఇది పడక కుర్చీలో ఒక భాగం మాత్రమే. వాస్తవానికి అతి చిన్నభాగం. అందులో కూర్చున్నవాళ్లెవరైనా సుఖపడటానికి ఏమాత్రం అవకాశంలేదు. కాళ్ళుపెట్టుకొనే పొడవాటి చెక్కలు. అవి నిలబడటానికి ఆధారాలు, వీపుఆన్చే వెనుకభాగం చాలవరకు అదృశ్యమయ్యాయి. కూర్చునే భాగంలో అల్లిన ఫ్రేమం అంతా పోయి ఏదో ఒక మనిషి కూర్చోవడానికి సరిపోయ్యేట్టు ఉంది. కుర్చీకింకా నాలుగుకాళ్ళూ ఉన్నాయి కాని కుర్చీలో కూర్చొన్నాయన అందోళనతో తరచుగా చూస్తుండటంవల్ల ఒక కాలు వదులుగా అటూ ఇటూ ఊగుతున్నట్లు తెలుస్తుంది. ఇంకో వకీలు తదేక ధ్యానంతో వార్తాపత్రిక చదువుతో ప్రక్కనే ఉన్న కిటికీ చువ్వ గట్టిగా పట్టుకున్నాడు. ఎందుకంటే అతను కూర్చున్న కుర్చీకి ఉండాల్సిన నాలుగు కాళ్ళలో ఒక కాలు తక్కు వగా ఉంది. ఇంకేసీటూ దొరక్కపోవడంవల్ల మరో వకీలు పొయ్యిమీద తువ్వాలు పరచుకొని బాసం పట్టువేసి కూర్చున్నాడు. ఈ విధంగా పొయ్యి మీద ప్లీడరుగా రాణించాడు.

వకీళ్ళంతా అక్కడ సమావేశం అయింతర్వాత అనేక విషయాల్ని గూర్చి మాట్లాడుకోవడం ప్రారంభిస్తారు. ఒకరోజు వాళ్ళు సమకాలీన మల యాళ సాహిత్యంగూర్చి చర్చిస్తారు. మలయాళ రచనల్లో పాండిత్య స్ఫోరక మైన సంస్కృతపదాలను వాడే కొందరు రచయితల అలవాటును వారు పరిహసిస్తారు. కొంతమంది సమీక్షకులు పుస్తకాలు చదవకుండానే, వాటిపై ఇతరులు వెలువరించిన అభిప్రాయాలను చదివి సమీక్షలు రాస్తారని వారం టారు. కథావసువు ఎంత జటిలమూ ఎంత గందరగోళమూ అయితే అంత

పాండిత్య ప్రదర్శకంగానూ, ప్రశంసా పాత్రంగానూ ఆ నవల ఉంటుందని వ్యంగ్యంగా మాట్లాడుతారు.

'చదివినప్పుడు చివరికి రచయిత గూడా గందరగోళ పడాలి' ఇదీ గొప్ప నవలకు పరీక్ష! వాస్తవానికి ఆనాటి సాహిత్యఅభ్యాసాలు కొన్నింటిపై చందుమీనన్ స్వంతాభిప్రాయాలనే ఆ వకీళ్ళు వ్యక్తం చేస్తున్నారని మనం అనుకోవచ్చు. శిల్పం రీత్యా చూచినట్లయితే ఇందులేఖలోని 18 వ అధ్యాయం కంటే ఇది తృప్తికరంగా అమర్చబడింది. ఈ విధంగా శారదలో ఉత్తమ శిల్పం కన్పిస్తుంది.

చందుమీనన్ కథారంగాన్ని మాత్రమే అందించటంవల్ల వస్తువు, కథా సంవిధానం గురించి సమగ్రమయిన వ్యాఖ్యానం చేయలేం. ఒక ధనిక జమీందారీ తార్వాడ్ తన్ను స్వీకరించి భరించాల్సి ఉంటుందని ఒక బాలిక అడగడం కథా వస్తువు. ఆమె హక్కు నిరూపింపబడుతుందా? లేదా? అచ్చన్, తిరుమూల్పాద్‌లు ఏవిధంగా ముందుకు సాగుతారు? శంకరన్, కుందన్‌మీనన్, వైతిపట్టార్‌లు నిర్వహించే పాత్రలేమిటి? శారదవైపు శంమ్ వారియర్ ప్రధాన సాక్షి అవుతాడా? లేకపోతే ఇందులేఖలో సేన్ల లాగా చందుమీనన్ ఇతర కొత్త పాత్రలను చివర కథలో ప్రవేశపెడ్తాడా? అతను కళ్యాణిఅమ్మ ప్రసవించినప్పటి డాక్టరును ఉత్తరదేశంనుంచి తీవికురావచ్చు లేకపోతే రామన్‌మీనన్ కుటుంబాన్ని బాగా ఎరిగిఉన్న, మీనన్ చేత బొమ్మలు వేయించుకొన్న ఏ లక్షాధికారినైనా ఉత్తరదేశం నుంచి రప్పించవచ్చు. ఈ కేసులో ప్రధాన పాత్ర వహించి కృష్ణమీనన్, శారదను పెళ్లి చేసుకొంటాడా? ఈ విషయాలన్నీ చందుమీనన్ మన ఊహకు వదిలివేశాడు. ఇక్కడ ఇంకో అవకాశం కూడా ఉంది. ఇరు పక్షాలు కేసులో ముందుకు సాగుతాయా? లేకపోతే బాగా ఆలోచించి అనవసరమయిన వ్యాజ్యాన్ని విడిచిపెట్టి రాజీపడతారా? తన పాఠకులకి వ్యాజ్యాలవల్ల ధనిక తార్వాడ్‌లు ఎలానాశనమయ్యారో చూపించాలనుకొంటే ఇరుపక్షాలకు విపరీతమైన ఖర్చులతోకూడిన కేసును పూర్తిగా నడిపించేవాడు. శ్రీ యం. పి. పాల్ చెప్పిన ఒక సంఘటననుబట్టి మనం ఒక నిర్ణయానికి రావచ్చును. ఒక స్నేహితుడు చందుమీనన్‌ను చూడటానికి వచ్చి ఏకాంతంగా నవ్వుతుండగా చూశాడు. ఆయన నవ్వుకు కారణం అడిగితే "క్రాస్ పరీక్ష చేసే

టప్పుడు కొప్పున్ని అచ్చన్ ఎట్లా ఉంటాడోనని ఆలోచిస్తున్నాను'' అని చందుమీనన్ సమాధానం చెప్పాడు. కాబట్టి ఆయన శారదలో న్యాయస్థాన దృశ్యాన్ని, దాని వివరాలకు రూపకల్పన చేయటం గురించి ఆలోచిస్తున్నా డని చెప్పవచ్చు. అతి సుదీర్ఘమయిన న్యాయస్థానానుభవంతో జోడింపబడి ఆయన మేధాశక్తి ఆ కోర్టుసీను నిర్మిస్తే, అది మలయాళ సాహిత్యంలో అతి గొప్పది కాకపోయినా, అతిగొప్ప కోర్టుసీనులో ఒకటైనా అయిఉండేది. ఈ అధ్యాయం భవిష్యత్తును నిర్ణయించే అధ్యాయమై ఉండేది. యువతి, అమాయకురాలు అయిన శారద అదృష్టాన్ని నిర్ణయించేది. ఇద్దరు ప్రసిద్ధ శత్రువులమధ్య ముఖ్యమైన తగాదాకు జనంలో ఆసక్తికి కేంద్రంగా ఉండేది. కొప్పున్నిఅచ్చన్, వైతిపట్టర్, కృష్ణమీనన్, శంకరన్ మొదలైన ప్రధాన పాత్రల భవిష్యత్తుకూడ ఈ అధ్యాయంలో తేలిపోయి ఉండేది. బహుశా పుస్తకం అంతట్లో ఈ అధ్యాయం అతిముఖ్యమైనది, దీర్ఘమైనదీ అయిఉండేది. ఇందులేఖలో దీర్ఘమైన అధ్యాయాలు ప్రేమికుల గురించినవి. ఉదాహరణకు మాధవన్, ఇందులేఖల సమావేశం, పూవల్లి కుటుంబంలో తన వివాహ ప్రయత్నంలో సూరినంబూద్రిపాద్, ఇందులేఖ, మరి ఇతర స్త్రీలతో జరిపిన సమావేశాలను తీసుకొనవచ్చు. ఇది సహజమే ఎందుకంటే ఈ కథ చట్టానికి, న్యాయస్థానాలకి సంబంధించినది. ఇందులేఖ ప్రేమకు, ప్రణయానికి సంబంధించిన కథ.

# 8

# ఇందులేఖ - శారద

పందొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థంలో మలబారులోని సామాజిక జీవనాన్ని తెలిపే అద్భుతమైన కథలు 'ఇందులేఖ', 'శారద' లు. 'ఇందు లేఖ'లో సంపూర్ణమైన కథ ఉంది. శారద ఒక కథకు ఆరంభం మాత్రమే. ఎప్పుడో గడిచిపోయిన కాలాన్నిగూర్చి చెప్పే చారిత్రక నవలలకన్నా,

భవిష్యత్తునుగూర్చి చెప్పే అద్భుతగాథలకన్నా, అపరాధ పరిశోధక, వైజ్ఞానిక గాథలకన్నా ఇవి భిన్నమైనవి. ఇవి సాంఘిక నవలలు అనే విభాగాంలో చేరతాయి. వంద సంవత్సరాలక్రిందట సంపన్నతార్వాడ్‌లలోని జీవితాన్ని వర్ణిస్తాయి. దౌర్జన్యపరులు, కోపిష్ఠులు అయిన కారణవన్లు, విధేయులు లేదా అభ్యుదయవాదులూ అయిన అనంతరవన్లు, స్త్రీలు, చట్ట పరమైన బంధువులూ మనకు కన్పిస్తారు నాయర్ కుటుంబాల్లో నంబూద్రీలు, పట్టార్లు, మొ॥ న ఇతర వర్ణాలవాళ్లు నిర్వహించే పాత్ర తెలుస్తుంది. ఆ రోజుల్లో ఆ తార్వాడ్లలో తలయెత్తుతున్న అధికార, ఆర్థిక, వివాహాది సంబంధమైన అనేక సమస్యల్లను ఈ నవలలు ఎత్తి చూపుతున్నాయి. కుటుంబాలమీద, సమాజంమీద వాటి ప్రభావం మంచిదో, చెడ్డదో పాఠకులు చూస్తారు. నిజమైన సాంఘిక నవలలుగా ఇవి పరిశీలనగా చదివే పాఠకునికి ఆనాటి జీవితాన్ని చిత్రించిన అనేక ఆసక్తిదాయకమైన చిత్రాల్ని అందిస్తాయి. ఇక్కడ కొన్ని ఉదాహరణలు మాత్రమే ఇస్తున్నాను.

తార్వాడ్లలో రెండు మూడంతస్థుల చతుర్ముఖ భవనాలుంటాయి. వంటగదులు, ఔట్ హౌజులు అనేక ఇతరావసరాలకుంటాయి. 'ముఖద్వారం మీద అతిథి గృహం ఉంటుంది'. ధనిక తార్వాడ్లలో బ్రాహ్మణులకు ఉచిత భోజనాన్నిచ్చే భోజనశాలలూ, విశ్రాంతి గృహాలూ ఉంటాయి. గృహ దేవాలయాలుంటాయి. ఇందులేఖ ప్రతిరోజూ దేవాలయానికి వెళ్తుంది. పంచు మీనన్ 'తాను పూజించే భగవతి' మీద ఒట్టుపెట్టుకుంటాడు. పూవల్లిలో శంకరశాస్త్రి రామాయణపారాయణం చేసినట్లుగానే తార్వాడ్లలో విద్వాంసులు ప్రతిరోజూ మత గ్రంథాలను చదివి వ్యాఖ్యానించేవాళ్ళు. ఇళ్ళల్లో గ్రంథాలయాలుండడం కూడా సాధారణమే. వీటిలో కాగితపు పుస్తకాలు, తాళపత్ర గ్రంథాలు ఉండేవి. చీకట్లో తీసుకొనిపోవడానికి వీలుగా ప్రత్యేక పద్ధతులకు చెందిన నూనెదీపాలుండేవి. ప్రయాణానికి సూరినంబూద్రిపాద్ వంటి ప్రధాన వ్యక్తులు పల్లకీలను, అంతకంటె కొంచెం తక్కువవాళ్ళు డోలీలను ఉపయోగించేవాళ్ళు. పూవల్లి తార్వాడ్‌లో ఐదారు పల్లకీలుండేవి.

ఇందులేఖను చూడడానికి, వివాహమాడడానికి పల్లకీలో సూరి నంబూద్రిపాద్ తార్వాడ్‌కు వచ్చినప్పటి హడావుడి సంఘటనను చందు మీనన్ వర్ణించాడు [1] :-

1. పే. 131.

'జరగబోయే వింత సన్నివేశం వర్ణనాతీతమైంది. పల్లకిని ఎనిమిది మంది, డోలీని ఆరుగురు మోస్తున్నారు. అప్పుడప్పుడు వాళ్ళకు విశ్రాంతి నిచ్చేవాళ్ళు పక్కన పరిగెత్తుతున్నారు. అందరూ ఏకకంఠంతో పాడాలని ఆజ్ఞ. మొత్తం 14 మందీ ఆ పాటను మళ్ళీమళ్ళీ పాడుతున్నారు. ముందు నడుస్తున్న ముగ్గురు, నలుగురు హై–హూ హై–హూ అని తాళం వేస్తున్నారు. ఈ ప్రత్యేకమైన పాట నంబూద్రిపాద్ ప్రత్యేకాధిక్యాన్ని తెలిపేది. ఈ విధంగా గందరగోళంతో కూడిన ఆడంబరంతో పల్లకీ ఆవరణలోకి వచ్చింది. ముఖద్వారం దగ్గరే చెరుశేరి నంబూద్రీ డోలీలోంచి దూకాడు. అయినా వాళ్ళు డోలీనికూడా ఆవరణలోకి మోస్తూనే ఉన్నారు. ఇందులేఖ, గోవిందన్ కుట్టి మీనన్లు తప్ప పంచుమీనన్ కుటుంబగృహంనుండీ, స్వంత ఇంటినుండీ పెద్దాచిన్నా భేదంలేకుండా అంతా ఏదో యుద్ధానికి వచ్చినట్లు గుంపుగా బయటికివచ్చి, అనుకూలమైన స్థలాల్ని ఎన్నుకొని ఆ గంతకుల్ని పరిశీలనగా చూడసాగారు. కిటికీలు, బాల్కనీలు స్త్రీలతో నిండిపోయాయి. యజమానులు మధ్యాహ్నభోజనాన్ని మరచిపోయి గౌరవనీయుడైన అతిథి నెదుర్కోవడానికి పంచుమీనన్‌తో వరండాలో గుంపుగూడితే కేశవన్ నంబూద్రీ అతిథి నాహ్వానించడానికీ, పల్లకీలోంచి దిగడానికి చేయూత నివ్వడానికీ ఆవరణలోకి దిగాడు. ఆవరణంతా ఎస్టేటు సూపర్వైజర్లతోనూ, నౌకర్లతోనూ నిండిపోయింది. వంటవాళ్ళు, పనివాళ్ళూ వంటగది కిటికీలలో నుండీ, గోడసందులనుండీ తొంగిచూస్తున్నారు. ఆడనౌకర్లు అరటిచెట్ల వెనుకా, తోడికంచెవెనుకా దాక్కొని వేడుక చూట్టానికి పోరాడుతున్నారు.

దేశద్రిమ్మరి బ్రాహ్మణులంతా భోజనం ముగించుకొని, విశ్రాంతి గృహంలో పగటి నిద్రపోతూ ఈ గొడవకూ, ఈ గ్రామ్యమందను తొలగండని హెచ్చరిస్తున్న కేకలకూ మేల్కొన్నారు. మేల్కొనగానే బయటికి పరుగెత్తి, పరుగెత్తుతూనే జుట్టుముడివేసుకుంటూ దొరికినచోటల్లా గుంపులో దూరారు. చివరకు చెరువుగట్టుమీదా, మెట్లమీదా కూడా నిండి పోయారు. 'ఓ! ఏమిటిది? వీడెవడు? భూకంపంగాని వస్తుందా? ఏమిటి?' అని బిగ్గరగా అరుస్తున్నారు. ఒక భూకంపం వచ్చినట్లుగా చెంబాజియోత్ పూవల్లి నివాసులు గందరగోళపడుతున్నారు.

అతితొాంచరలో ఏర్పాటైన వివాహోత్సవ వర్ణన ఒకటుంది. 1 పంచుమీనన్ ఆహ్వానించగా 'చెరుశేరి నంబూద్రిపాద్, కేశవన్ నంబూద్రీలు తమ పరివారంతో పూవల్లికి ప్రయాణించారు. సాధారణాచారం ప్రకారం ముఖద్వారం దగ్గరా, వివాహానికి ప్రత్యేకించిన గదిలోను పాదప్రక్షాళనం చేసుకుని ఖరీదైన పట్టుతివాచీ పరిచిన ఆసనంమీద నంబూద్రిపాద్ కూర్చున్నాడు. ఆ గది తూర్పువేపుద్వారం మూసిఉంది. అంతలో ఇంట్లోని ఆడవాళ్ళంతా పశ్చిమద్వారాన్ని తోసుకుని కల్యాణికుట్టితో వచ్చారు. ఒక బతికిఉన్న పందినో మరో జంతువునో అన్నట్టుగా చుట్టుముట్టి ఆమెను గదిలోకి నెట్టారు. వాళ్ళు త్వరత్వరగా బయటకువెళ్ళి పడమటిద్వారానికి గొళ్ళెంపెట్టారు. ఈ విధంగా సమాగమం పూర్తయింది.' మరుమక్కత్తాయం వివాహాలలో సాధారణ పద్ధతిగా దీన్ని భావించకూడదు. ఇందులేఖ వివాహ విషయంలో చందుమేనన్ మాటల్లో ఈ వివాహపద్ధతిని గూర్చిన సూచన లేమీ లేవు. 'మాధవన్ తిరిగి వచ్చింతర్వాత ఏడవరోజున ఇందులేఖ పాణిగ్రహణం జరిగింది' అనిమాత్రమే చెప్పాడు. పై మాటలు నాయర్ల వివాహాలు అతిసామాన్యంగా ఉంటాయని సూచిస్తే మనం తప్పక సంబంధాలు లేక పుదమూరీలు అని పేరుగాంచిన నాయర్ వివాహాలను గూర్చిన చందుమీనన్ వివరణాత్మక విశ్లేషణాన్ని తెలుసుకోవలసి ఉంటుంది. 'అవసరమూ, క్రమబద్ధమూ నైన, ప్రాచీనమైన అనేక స్థానికాచరణలతో కూడిఉన్నది మరుమక్కత్తాయం వివాహ పద్ధతి. అది సామాన్యమైంది కాదు' అని మలబారు మ్యారేజ్ కమిషన్‌ను జతచేసిన డిస్సెంటు పత్రంలో చందు మీనన్ విశ్లేషించాడు

ఈ నవలలనుండి ఆనాటి స్త్రీ పురుషుల దైనిక జీవితాన్ని వాళ్ళ స్నానపానాలు, వస్త్రాలు, నగలు మొ॥ న వాటిగురించి తెలునుకుంటాం. పంచుమీనన్, మెడలో స్వర్ణహారాన్ని, కొప్పున్ని అచ్చున్ రుద్రాక్షమాలను వేసుకుంటారు. ఇద్దరూ నడుముకు బంగారు ధట్టీలు పెట్టుకుంటారు. మాధవన్ పొడవాటి కుచ్చునూ, రాళ్ళు తాపిన బంగారు కమ్మలనూ పెట్టు కుంటాడు. పద్దెనిమిదేళ్ళ ఇందులేఖ చెవులకు బంగారు కమ్మలనూ, తంజా వూరు కడియాలనూ, హారాలనూ (వాటిలో ఒకటి రత్నాలు తాపినది),

1. పే. 248.

పచ్చలూ, రత్నాలూ పొదిగిన ఉంగరాలనూ ధరించింది. పదకొండేళ్ళ శారద చెవులకు బంగారు పోగుల్నీ, మూడుపేటల ముత్యాల హారాన్నీ, రెండుంగరాల్నీ, బంగారపు ఒడ్డాణాన్నీ ధరించింది. ఇక ఆశవాళ్ల వెంటబడే సూరి నంబూద్రిపాద్ వద్ద అనేక ఆసక్తి దాయకమైన వస్తువులు కన్పిస్తాయి.[1] డజనుకుపైగా ఖరీదైన బంగారు, వెండి జరీఅంచు పొడవాటి అంగీలు, అనేక పట్టుఅంచు వస్త్రాలు, అనేకవిధాల ఉంగరాలు, బంగారం పొదిగిన ఒక స్వచ్ఛమైన వెండిపాత్ర, తమలపాకులు పెట్టుకొనే ఒక చిన్న బంగారు గొట్టం, వెండి చెంబు, వెండి దీపాలు, పోకలు పెట్టుకోవడానికి వెండి పెట్టె, మెడలో హారంగా వేసుకోవడానికి చైనుతో ఉన్న బంగారు గడియారం, బంగారం, పట్టు ఎంబ్రాయిడరీ చేసిన మడమలదాకా ఉండే వెల్వెట్ అంగీలు, టోపీలు, పవిత్రమైన కులచిహ్నంగా వెండి గంధపుపాత్ర, బంగారపు ఫ్రేము అద్దం, బంగారు పన్నీటి బుడ్డి. గులాబీ అత్తరు సీసాలు ఇంకా ఎన్నో వస్తువులు బల్లమీద గందరగోళంగా వేసిఉన్నాయి.

నిజంగా అతనికి చాలా ప్రాపంచికమైన అభిరుచు లున్నాయి. అయితే ఇతరులకు లాగానే మూఢనమ్మకాలు కూడా ఉన్నాయి. శనివారం అభియోగం మీద సంతకం పెట్టినందుకే ఒక కేసు ఓడిపోయానని అతని నమ్మకం. దీపపు వెలుతురులో క్షౌరం చేయించుకోకూడదనీ, క్షౌరం తర్వాత స్నానం చేయందే మరేపనీ ముట్టుకోకూడదని నమ్ముతాడు. దేవతకీ, బ్రాహ్మణులకీ దానాలుచేస్తే తాను ఒట్టునుంచి బయటపడతానని పంచుమీనన్ విశ్వసించాడు. తమనుతాము జ్యోతిష్యులమని చెప్పుకునే వాళ్ళకు ధనికుల్లోనూ, బీదల్లోనూ చాలామంది క్లయింట్లున్నారు. పేజీ తర్వాత పేజీ తిరగవేస్తుంటే విధవా పునర్వివాహం, పెద్దలు పిన్నల మధ్య, భిన్నవర్గాలమధ్య మర్యాదలు, కథకళి, తమలపాకుల ఉపయోగం, దేవాలయాలు ఇట్లా ఎన్నైనా విషయాలు వస్తాయి. పైన చెప్పినవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. 19 వ శతాబ్దపు మలబారు సాంఘిక జీవనానికి సంబంధించిన అసంఖ్యాక చిత్రాలతో కూడిన ఉత్తమ ఆల్బములుగా ఈ నవలల్ని భావించవచ్చు.

'ఇందులేఖ'ను ఇంగ్లీషులోనికి అనువదించిన డబ్ల్యు. డూమెర్గ్ కు రాసిన ఉత్తరంలో తానీ నవల లెందుకు రాసిందీ చందుమీనన్ చెప్పాడు ఆ

1. పే. 122.

లక్ష్యాలను సాధించడమేకాక ఈ నవలలు ప్రాచీన ధనిక తార్వాడ్ల శక్తిని తగ్గించే కొన్ని విషయాలను వెల్లడిస్తున్నాయి. ఉదాహరణకు కారణవర్ల దౌర్జన్యం, సాంప్రదాయ బద్ధత, పక్షపాత ధోరణులు, భోగలాలసులు, బాధ్యతా రహితులూ అయిన నంబూద్రీల వివాహసంబంధాలు, వ్యర్థంగా, అనవసరంగా, తరచుగా జరిగే కోర్టు తగాదాలను పేర్కొనవచ్చు. తన లక్ష్యాలను నెరవేర్చుకోడానికి చందుమీనన్ అనేక పాత్రల్ని తన కథల్లో ప్రవేశపెట్టాడు. ఎప్పుడూ ఎవరిమీదో ఒకరిమీద అరుస్తూఉండే దౌర్జన్యపరులైన కారణవర్లు పంచుమీనన్, కొప్పున్ని అచ్చన్లు, వి.ఎన్.వైతిపట్టార్, అధికప్రసంగి కుందన్‌మీనన్, ఇంగ్లీషు విద్యనభ్యసించిన మాధవన్, కృష్ణమీనన్, ఇందులేఖ అభ్యసించని కల్యాణికుట్టి మొదలైన పాత్రల్ని ఉదహరించ వచ్చు.

'ఇందులేఖ'లో పంచుమీనన్ హద్దుమీరిన అధికారం ఎట్లా ఇందులేఖ, మాధవన్‌లు తిరగబడేట్లు చేసిందో చూపించాడు. నంబూద్రీలలో విచిత్రమైన సంబంధాలవల్ల ఎటువంటి గొడవలూ, అవమానాలూ సంభవిస్తాయో మన కర్థమౌతుంది. 'ఇందులేఖ'లో వివాహం, ప్రేమ ప్రధానవస్తువులు. అభిప్రాయ భేదాలకు తావిచ్చిన ఒక్క పద్దెనిమిదో అధ్యాయాన్ని విడిచిపెడ్తే మిగిలిన వాటిలో మాధవన్ ఇందులేఖల సమావేశం, నంబూద్రిపాద్ తన వివాహ ప్రయత్నంలో ఇందులేఖను, ఇతర స్త్రీ పాత్రలను కలుసుకోవడం మొ॥ ఉన్న అధ్యాయాలే పెద్దవి. కథలో దాదాపు సగం పాత్రలు స్త్రీ పాత్రలు. ఇందులేఖతోపాటు పార్వతిఅమ్మ, లక్ష్మికుట్టిఅమ్మ, కుమ్మినిఅమ్మ, కల్యాణికుట్టి, కొందరు పరిచారికలు ఉన్నారు. ప్రేమ బాధిత హృదయాల దుఃఖాల్ని చూస్తారు. ఒక రొమాంటిక్ నవలలో ఇవన్నీ ఉండవలసినవే.

శారదలో విషయాలు భిన్నంగా ఉంటాయి. ఈ పుస్తకంలో చాలా స్థలాల్ని, కాలాన్ని కోర్టు బుర్రల పథకాలు ఆక్రమించాయి. 'శారద' లోని మంచి పాత్రలు, చెడ్డ పాత్రలుకూడా 'ఇందులేఖ' లోని పాత్రలకంటే పరిపక్వమైనవి, గంభీరమైనవి. కొప్పున్ని అచ్చన్ పంచుమీనన్‌కంటే ఎక్కువ నిర్లక్ష్యంగాను, రంధ్రాన్వేషకుడుగాను ఉంటాడు. ఏదేట్లాఉన్నా ఇందులేఖ విషయంలో పంచుమీనన్ ప్రేమను, కరుణా హృదయాన్ని ప్రదర్శించాడు. 'శారద' లోని కొప్పున్ని అచ్చన్ గూర్చి అయినంతవరకూ కథలో స్త్రీపాత్ర

పాఠకులు తప్ప మరెవ్వరు మంచి చెప్పలేరు. అతను క్రూరుడు, కపటి, పగబట్టే స్వభావం కలవాడు. 'ఇందులేఖ' లోని శీనుపట్టార్ 'శారద' లోని వైతీపట్టార్‌కు ఏ విషయంలోనూ సరిపోలడు. శీనుపట్టార్ మూఢుడు— కనీసం పూవల్లితార్వాడ్‌లోని ఒక స్త్రీని భర్తగా ఉండే గౌరవమైనా అతని కుంది కాని వైతిపట్టర్ పూంబోలక్కార తార్వాడ్‌లోని ఒక స్త్రీని దోచు కోవడానికి ప్రయత్నించాడు. శీనుపట్టర్ మనిషిలా కన్పించినందుకైనా మనం సంతోషించాలి. బయటికి నెట్టుకొని వస్తున్న కోరలతో, తాచుపాము కన్నులతో సైతానులాగా దుర్మార్గం మూర్తీభవించినట్లు వైతిపట్టర్ కన్పిస్తాడు.

'ఇందులేఖ' ఇంగ్లీషు అనువాదంలో మాధవన్ రూపాన్ని, గుణ గణాల్ని, అతడు సాధించిన విజయాల్ని సుమారు 2 పేజీల వర్ణన ఉంది. 'శారద'లో కృష్ణమీనన్ రూపాన్ని, నడవడిని, సాధించిన ఘనకార్యాల్ని వర్ణించడానికి చందుమీనన్‌కు 4½ పేజీలు పట్టింది. ప్రేమలో పడిన యువ కుడుగా మాధవన్ చిత్రింపబడ్డాడు. కృష్ణమీనన్ ప్రేమలో పడలేదు. మాధవన్ మన సానుభూతిని పొందుతాడు. కృష్ణమీనన్ మన అభిమానాన్ని చూరగొంటాడు.

ఇక నంబూద్రీ పాత్రలను గురించి చూస్తే 'ఇందులేఖ' లోని చెరు షేరి తెలివైనవాడూ, గంభీరుడూ. అతనిలో కొంత సంస్కారం ఉంది. అతను కథకళిలో లేడూ? అతను విదూషకుడిలాగానూ, ఆడవారి వెంట పడే వాడిలాగానూ ప్రవర్తిస్తాడు. అయినా ఆ కథాంతమూ నిండైన వస్త్ర ధారణ (బంగారమే అనుకోండి) తో కన్పిస్తాడు. మరి 'శారద' లోని నంబూద్రీల గుంపును చూడండి. కొంతమంది నగ్నంగా, కొంతమంది స్నానం చేయకుండా చుట్టూ గంతులేస్తూ ఒక అమ్మాయిని గూర్చిన ఉత్తరంపై అనవసరమైన వ్యాఖ్యానాలు చేస్తూ కన్పిస్తారు. వాళ్ళు నిజంగా ఒక అనాగ రిక సమూహంలో కన్పిస్తారు.

ఇందులేఖ అద్భుత సౌందర్యవతి, కాని ఆమె సౌందర్యం పరాకాష్ఠను చేరుకుంది. శారదది అప్సరసల సౌందర్యం. ఆమె ఇంకా చిన్నపిల్లే కాబట్టి యౌవనంలో అడుగుపెట్టేటప్పటికి మరింత సౌందర్యవతి అయ్యే ఆశ ఉంది. దివ్యసౌందర్యం ఆమెలో వెల్లివిరుస్తుందేమో. జరిగినంతవరకు కథలో

ఇదొక్కటే స్త్రీ పాత్ర. చెప్పిన రెండుమూడు స్త్రీ పాత్రలపేర్లూ వాళ్ళీ లోకం విడిచిపెట్టారని చెప్పడానికే. పుస్తకం మొదటి రెండు పేజీల్లో శారద తల్లి కల్యాణి అమ్మగొంతు వినిపిస్తుంది. కాని అది మరణ శయ్యమీదినుండి వినిపించే సన్నని బలహీనమైన గొంతుక. కొన్ని వాక్యాలు మాట్లాడిన అనంతరం అది శాశ్వతంగా మూగపోయింది. 'శారద' నవలలో పురుష ప్రాధాన్యం ఎక్కువ.

'శారద' లోని పురుషులు తమకు సంబంధించిన హక్కులు, కేసులు, కోర్టులు మొదలైన వాటిపై ఆసక్తి చూపిస్తారు వాతావరణం చాలా గంభీరం గాను, ఒక్కొక్కసారి భయంకరంగాను ఉంటుంది. శంకరణ్ను హత్య చేయ డానికి పైతిపట్టార్ న్యాయాన్యాయ విచక్షణలేని కరుప్పణ్తో విషం తయారు చేయించడానికి చేసిన సమావేశం దీనికొక ఉదాహరణ. 'ఇందులేఖ'లో ఇందులేఖ స్థానంలో కల్యాణి కుట్టిని పెట్టిన ఘట్టం దీనికంటె ఎంత భిన్నంగా, చమత్కారంగా ఉంటుంది? సూరి నంబూద్రిపాద్ ఒక డాక్యు మెంటును రిజిష్టరు చేయించే విషయంలో మేనేజరుతో మాట్లాడే సందర్భంలో మాత్రమే న్యాయవిషయ సంబంధమైన చిన్న సూచన ఇందులేఖలో కన్పి స్తుంది. తక్కిన నవలలోని వాతావరణమంతా రొమాంటిక్‌గా ఉంటుంది. 'శారద'లో చాలా భాగం న్యాయపరమైన హక్కులగురించీ, న్యాయవిష యాల గురించీ, న్యాయగ్రంథాలలోని విషయాల గురించిన సంభాషణలతో నిండి ఉంటుంది. 'ఇందులేఖ' లో మనలో ఉత్సాహాన్ని రేకెత్తించేవి ఉత్సు కత, ప్రేమలు. 'శారద'లో ముందేదో కీడుజరుగుతుందన్న అనుమానం, వ్యతిరేకతా భావాలు.

ఇక్కడ మనం స్థలాలను, వ్యక్తులను అవి పెద్దవైనా, చిన్నవైనా' వైభవోపేతమైనవైనా, సామాన్యమైనవైనా వర్ణించడంలో చందుమీనన్ కళా నైపుణ్యాన్ని గుర్తుచేసుకోవచ్చు. తన వర్ణనలతో ఆయన మనలో ప్రశం సనూ, హాస్యాన్నీ పుట్టిస్తాడు. అతి గొప్ప అంశాలనూ, అతి తక్కువ అంశా లనూ రెండింటినీ చక్కగా వర్ణించగలడాయన. సూరి నంబూద్రిపాద్, కృష్ణ మీనన్ల వర్ణనలనూ, సేన్ల గృహాన్నీ, వకీళ్ళ క్లబ్బునూ ఉదహరించవచ్చు.

'శారద' అసంపూర్ణం అయినప్పటికీ ఇందులేఖకంటే పరిపక్వదశకు చెందిన నవల అని చెప్పవచ్చు. ఉత్తమ, అధమ పాత్రలన్నీ పెద్ద ఎత్తున

నిర్మించాడు. 'శారద'లోని దుష్టపాత్రలు 'ఇందులేఖ'లోని దుష్టపాత్రల కంటె దుష్టాలు. ఉత్తమ పాత్రలు మరింత ఉత్తమాలు. కొన్ని ప్రదేశాలు కూడా 'శారద'లో 'ఇందులేఖ'లో కంటే వైభవోపేతంగా ఉంటాయి. ఇందులేఖలో పూవల్ల తార్వాడ్ ఆదాయం సంవత్సరానికి పొలాలనుండి 28 వేల బస్తాల ధాన్యం, తోటలనుండి పదివేల రూపాయలు. 'శారద' లోని పూంచో లక్కార తార్వాడ్ ఆదాయం లక్షబస్తాల ధాన్యం, తోటలనుండి యాభైవేల రూపాయలు. పూంచోలక్కార్ ఏదమ్‌లోని గుడి, సత్రాలు, గోసాయి మఠాలు పెద్దవి. చెరువు చాలా పెద్దది. ఈ ఒడ్డునుండి ఆ ఒడ్డున ఉన్న మనిషిని గుర్తించలేం. ఇక "నాలుగు భోజనశాలల్లో బ్రాహ్మణులకు ఉచితంగా భోజనం పెడ్తారు" అని పూంచోలక్కార్ తార్వాడ్‌లో బ్రాహ్మణ భోజనాల గురించి వైతిపట్టార్ రామణ మీనన్‌తో చెప్తాడు. బ్రాహ్మణులకు ఉచిత భోజనశాలలు పూవల్లి తార్వాడ్‌లో రెండే ఉన్నాయి. ఈ తార్వాడ్ ఏకాంతంగా గ్రామ ప్రాంతంలో ఉంది పూంచొలక్కాలర పదమ్ దానికంటే పెద్దది. వైభవోపేత మైంది. బాగా అభివృద్ధిచెందిన ప్రాంతంలో ఉంది.

చందుమీనన్ బహు విస్తృతంగా ఆలోచించి 'ఇందులేఖ'లో కంటే పెద్ద స్థలాలను, శక్తివంతమైన పాత్రలనూ 'శారద' లో నిర్మించాడు. సంపూర్ణమైన 'ఇందులేఖ' చాలా మంచి కథ. అసంపూర్ణమైనా 'శారద' అంతకంటే గొప్ప కథ అయ్యే ఆశను కల్పిస్తోంది.



# పునశ్చరణ

'కనుక ఎవ్వరికి రావలసింది వారికి అప్పగించండి' — రోమన్స్

మొదటి అధ్యాయాన్ని ఈ పునశ్చరణతో కలిపి మొత్తం కథనాన్ని పూర్తిచేయాలి. చందుమీనన్ నూతన మార్గావిష్కర్త అనే మాటతో మొదలు

పెట్టాం. అప్పటికి ప్రచారంలో ఉన్న అభ్యాసాలనుండి, విశ్వాసాలనుండి మరచి చందుమీనన్ సాధారణ మలయాళంలో మలబారు సామాన్య ప్రజల జీవితాన్ని గూర్చి అధిక ప్రచారాన్ని పొందే ఒక నవలను రచించవచ్చని నిరూపించాడు. ఆయన తన పుస్తకాల్లో ఉపయోగించిన వస్తువు, పాత్రలు, భాష ప్రాచీన, సమకాలీన మలయాళ నవలలకంటే భిన్నమైనవి. 'ఇందు లేఖ'ను అనువదించిన ఆంగ్లేయాధికారి డూమెర్గ్ దాని విజయాలను 1893 లో రాసిన పీఠికలో ఇట్లా అంచనా వేశాడు: "పూర్వకవుల అనుకరణలతో బూజుపట్టిన మార్గాన్ని చందుమీనన్ విడిచిపెట్టాడు. ఆయన తన రచనలో ఆధునిక మాలబారును చిత్రించాడు. 'ఇందులేఖ' లోని భాష నేటి సజీవ మలయాళం ఎండిపోయిన ఈ ఎముకల లోయలోకి దిగడం, వాటి పునరుజ్జీవనం తర్వాత పుట్టుక చేతనో, అవసరం చేతనో ప్రాచ్యసాహిత్య పునరుజ్జీవనాన్ని కాక్షించే వాండ్లంలో చందుమీనన్ ప్రశంసాపాత్రుడంటాను నేను."

ఆయన కాలంలో మలయాళ సాహిత్యంలో కవిత్వం చాలా ప్రముఖమైన ప్రక్రియ. మలయాళ సాహిత్య ప్రపంచంలో గుర్తింపు పొందాలంటే కవిత్వం రాయడమే మార్గం. ఒక వ్యక్తి ఉత్తమ అభిరుచులు, సంస్కారం ఉన్నవాడనిపించుకోవడానికి కవిత్వాన్ని బాగా అధ్యయనంచేసి ఉండాలి. అంటే వచన రచన అసలు లేదనికాదు. గద్యసాహిత్యం ఉందికాని అతి ప్రధానమైన సాహిత్య ప్రక్రియగా దానికి గుర్తింపు లేదు. సమకాలీన సాహిత్యంలో మరొక లక్షణ మేమిటంటే పద్య గద్య రచనలు రెండింటిలోనూ మలయాళ రచయితలు సంస్కృతాన్ని అధికంగా వాడారు ఈ ప్రమాణాలనుండీ, సంప్రదాయాలనుండి చందుమీనన్ తప్పుకున్నాడు. ఆయన గద్యం రాశాడు. అదీ సాధారణ మలయాళంలో. సంస్కారవంతుల ఇళ్లలో సామాన్య సంభాషణలలో దొర్లే సంస్కృత పదాల్నే ఆయన వాడాడు. అయినా ఎంతో మంది మలయాళ కవులు సాధించలేకపోయిన ప్రచారాన్ని, స్థానాన్ని మలయాళ రచయితగా ఆయన గెల్చుకున్నాడు.

ఆయన 'ఇందులేఖ' రచించేటప్పుడు కొంతమంది మిత్రులు జనం వైజ్ఞానిక రచనలే చదువుతారనీ, మరికొంతమంది మిత్రులు దయ్యాల కథలే ప్రచారం పొందుతాయనీ హెచ్చరించారని మనకు జ్ఞాపకం ఉంది. ఇటువంటి

వ్యాఖ్యలవల్ల ఆయన భయపడలేదు. అధైర్యపడలేదు. వాళ్లను లెక్కచెయ్య కుండా సమకాలీన మలబారు సామాజిక, గృహజీవితాన్ని కథగా రచించాడు. ఆయన పుస్తకం అలక్ష్యాన్నిగాని, తిరస్కారాన్ని పొందటానికి బదులుగా కనీవినీ ఎరుగని వ్యాప్తిని పొందింది. అప్పటినుండి ఇప్పటివరకూ గొప్ప అభిమానాన్ని పొందుతూనే ఉంది.

ఈ విధంగా ఏ నవలా రచయితా పూర్వం ప్రయత్నించడానికి సాహసించనిదాన్ని చందుమీనన్ సాధించాడు. నాయర్ తార్వాడ్ల జీవితాన్ని వర్ణించడానికీ, ఆ తార్వాడ్లలో వాడే భాషను ఉపయోగించడానికీ ఎవరూ ప్రయత్నించలేదు. ఒక్కమాటతో చెప్పాలంటే సరైన అర్థంలో మలయాళంలో ఎవరూ నవలే రాయలేదు. అప్పుడు చందుమీనన్ పుస్తకాలు వచ్చాయి. వాటిలో ప్రధాన సంఘటనలు జరిగిన ప్రదేశం మలబారు. దాదాపు పాత్రలన్నీ మలబారువే. భాష మలయాళీ కుటుంబాలలో మాట్లాడేదే. తన గ్రంథ విజయాన్నిగూర్చి ఆయనకు కొన్ని సందేహాలుండేవి. మొదటి ప్రచురణ పీఠికలో ఈ అనుమానాల గురించి రాశాడు. కాని ఆయనకు సాహసంకూడా ఉంది. తన ప్రతిభతో దయ్యాలనూ, మహారాజుల్నీ ప్రవేశ పెట్టకుండానే చాలా గొప్ప నవలలు రాయవచ్చునని నిరూపించాడు. తమ దైనిక జీవిత కార్యకలాపాలలో మగ్నులైన సామాన్యులు, తప్పనిసరిగా నిజాయితీపరులూ, స్నేహపాత్రులూ కాకపోయినా మంచి కథకు అవసరమయిన విషయాన్ని ఇస్తారనీ, సామాన్య నిజాలను అసామాన్య రచనగా మార్చవచ్చుననీ నిరూపించాడు. తన పీఠికలో 'శైలి, కూర్పులో అందం అనేవి ప్రత్యేకమైన జాగ్రత్తను తీసుకోవలసిన విషయా లనుకుంటున్నాను' అని రాశాడు. 'జీవితానికి సంబంధించి సహజంగా ఉండే సంఘటనలతో కూడిన కథలు ఆకర్షణీయంగా, అందంగా రాయబడి ఒకసారి పరిచయమైతే, మెల్లమెల్లగా అవాస్తవిక, అతిమానుష విషయాలతో నిండిన కథల పాత పద్ధతి మారి కొత్త కథలకు స్థానం వస్తుంది' అని ఆ భావాన్నే మళ్ళీ చెప్పాడు. ఈ విధమైన సాహిత్యంలో మలయాళ పాఠకులకు అభిరుచి కల్గించడానికే ఆయన 'ఇందులేఖ'ను రచించాడు. చందుమీనన్ అంచనాలు నిజమని, పాఠకులు అటువంటి రచనను అమితంగా ప్రశంసిస్తారని ఈ గ్రంథ విజయం నిరూపించింది.

ఆయన నవలలు నంబూద్రీల నడవడిలోని లోపాలను, నాయర్ సమాజంలో వాళ్ల వివాహ సాహసకృత్యాల ప్రభావాలను వెల్లడిచేస్తున్నాయి. దౌర్జన్యపరత్వం, మొండితనం, తగాదాలమారితనం లక్షణాలుగా ఉన్న కారణవల్ల మూలంగా మరుమక్కత్తాయం తార్వాడ్ల నిలకడా, నిర్మాణమూ ప్రమాదంలో పడ్డాయి. చందుమీనన్ తన నవలలద్వారా ఈ సత్యాన్ని కూడా స్పష్టం చేశాడు. ఈ నవలలు కొన్ని లక్ష్యాలను నెరవేరుస్తున్నాయన్నప్పుడు, ఇటువంటి నవలలను రచించిన థాకరే, డికెన్సు టాల్‌స్టాయ్ మొదలైన రచయితలు గుర్తొస్తారు. అయినా చందుమీనన్ను ఈ ప్రసిద్ధ రచయితలతో పోల్చవలచుకుంటే, వాళ్లలాగా ఆయన వృత్తి రచన కావనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. న్యాయశాఖలో ఒక అధికారిగా అభియోగాలను వినడమూ, తీర్పు చెప్పడమూ ఆయన ప్రధానమైన పని. సాహిత్య రచనలతో పరిచయం తక్కువే. ఆయనకు తీరిక చాలా తక్కువ. తన అధికార బాధ్యతలన్నీ పూర్తి చేసుకున్న తర్వాత ఏమైనా కొంత సమయం చిక్కితే నవలారచన కుపయోగించేవాడు. మరి మిగతావాళ్ళో. వాళ్ళ వృత్తి రచన. వాళ్ల సర్వశక్తుల్నీ సమయాన్నీ కథల్ని రాయడంలో, తీర్చి దిద్దడంలో ఉపయోగించేవాళ్ళు. వాళ్ళు నిజంగా ప్రపంచ ప్రసిద్ధ రచయితలే. కాని చందుమీనన్ స్థానం చందుమీనన్‌దే.

ఒక నవల విలువను తెలుసుకోవడానికి అతి తేలికైన, సామాన్యమైన పరీక్ష దాని ప్రచారం. ఒక నవల చరిత్ర గురించి చెప్పినా, సమాజం గురించి చెప్పినా, కలిమి గురించి చెప్పినా, లేమి గురించి చెప్పినా, హాస్యంగా ఉన్నా, గంభీరంగా ఉన్నా, దానికో లక్ష్యం ఉన్నా లేకపోయినా పాఠకుల దృష్టి నాకర్షించలేకపోయినట్లైతే అలమరల్లో దుమ్ముపట్టి పోయినట్లయితే అది మంచి నవల కాదు. అది కవల నవల అవుతుంది. 'ఇందులేఖ' 1956 నాటికే అనేక ప్రచురణలు పొందింది. 'శారద' అసంపూర్ణంగానే 1958 నాటికి పన్నెండు ప్రచురణలు పొందింది. ఈ అంకెలు నవలల ప్రమాణాన్ని నవలాకర్తగా చందుమీనన్ సామర్థ్యాన్ని నిరూపిస్తున్నాయి. కథలో <u>ముడుల</u> వల్లా, వైభవోపేతమైన దృశ్యాలవల్లకాక సాధించిన విజయం కాబట్టి ఈ సామర్థ్యం మరింత గొప్పది. రాజుల అధికార స్వరాలూ, సైన్యాల పద ఘట్టనలూ వినిపించవు. దయ్యాలు, మంత్రగత్తెలూ, ఆకాశంలో ఎగర

డాలూ, రక్తపాతమూ, ఆయుధాల ఘర్షణా కనిపించవు. ఒక చిన్న తగాదా కాని, బలాబలాలను తేల్చుకోవడంకాని 'ఇందులేఖ' లో కన్పించనే కన్పించవు. వేగంతోకూడిన కదలికల సంచలనాలు లేవు. పంచుమీనన్ చేతికర్ర నుండి తప్పించుకోడానికి శీనుపట్టర్, అతని కొడుకు గోపాలన్‌లు మాత్రం చిన్న గంతులు వేసారు.

అసాధారణమైన నేర్పుతో సామాన్య వ్యక్తులను చిత్రించడమే ఈ నవల విజయానికి కారణంగా పేర్కొనవచ్చు. ఇటువంటి పాత్ర చిత్రణ ద్వారా, కథలో ఈ పాత్రలు నిర్వహించే కార్యాల అద్భుత వర్ణన ద్వారా ఇందులేఖ ఒక మహాకావ్య స్థానాన్ని నిలబెట్టుకుంటుంది. 'ఇందులేఖ' లో కొన్ని దృశ్యాలు ముఖ్యంగా పంచుమీనన్, సూరినంబూద్రిపాద్, మాధవన్, ఇందులేఖను కన్పించె దృశ్యాలు మన మనోవీధిలో సుదీర్ఘకాలం జీవిస్తాయి. 'శారద'లో కూడా వైతిపట్టర్, చాతుపణిక్కర్‌లు కన్పించే చోట్లు, వకీళ్ళ క్లబ్బు దృశ్యం కూడా చిరకాలం గుర్తుండేవే. వీటన్నిటితోపాటు మనం ఇంకో ఊహ చేయవచ్చు. శారద హక్కుల్ని విచారించే కోర్టు దృశ్యాన్ని చందుమీనన్ రాసినట్లయితే మలయాళ సాహిత్యంలో ఇంతవరకు ఎవరూ అధిగమించలేని ఒక వజ్రంలాంటి దృశ్యం అయిఉండేదది. ఇది ఒక ఊహ మాత్రమే అయినా మనకు తెలిసినంతవరకు చందుమీనన్ సామర్థ్యాలను బట్టి చూస్తే న్యాయమైందే. అతని పాత్ర ఎంత గొప్పగా చిత్రించబడ్డాయంటే అవి కథలోనే గాక కథ వెలుపలకూడా జీవిస్తాయి. అవి స్వతంత్రాలు. ప్రత్యేకంగా స్వతంత్రమైన ఉనికి ఉండే పాత్రల్ని అతికొద్దిమంది నవలా రచయితలు, నాటకకారులు మాత్రమే సృష్టించగలరు.

ఇట్టి అద్భుతమైన పాత్రచిత్రణ వల్లనేకాక, కాంతివంతమైన చమత్కారంవల్లకూడా 'ఇందులేఖ' ఎనభైరెండు సంవత్సరాల నుంచి కొన్ని తరాల పాఠకుల్ని ఆకర్షించి, ఆకర్షిస్తోంది. వయస్సువల్ల అది ఉడిగిపోలేదు; ఆచారం వల్ల దాని జీవవంతమైన చమత్కారం పాతబడిపోలేదు. చాలా సాంఘిక

నవలలు హాస్యరసభరితంగా ఉంటాయి. 'ఇందులేఖ'లో సూరి నంబూద్రిపాద్ ఆకార విశేషాలు, అలంకరణ, సంభాషణ. ఇతరులకు ప్రతిస్పందించే తీరు అన్నీ విలక్షణమైన హాస్య రసస్ఫోరకంగా ఉంటాయి. అతనెక్కడ కన్పిస్తే అక్కడ నవ్విస్తాడు. పంచుమీనన్‌కూడా అంతే. ఈ పాత్రలు పుస్తకంలో కాని, నాటక రంగంమీదకాని మాటల యుద్ధంలో అతి గంభీరంగా ఉంటాయి. కాని పాఠకులకు, లేదా ప్రేక్షకులకు అతి తమాషాగా ఉంటాయి. 'ఇందులేఖ' కంటె గంభీరమైనప్పటికీ 'శారద' లో కూడా అనేకచోట్ల చందుమీనన్ హాస్యాన్ని అందిస్తాడు. కొప్పున్ని అచ్చన్, వైతిపట్టర్. కుందన్ మీనన్‌ల వర్ణనలందు కుదాహరణలు. వైతిపట్టార్ విషంవల్ల చనిపోయినవాణ్ణి గుర్తించడంలో పొరపాటుచేసిన ఘట్టం, చాతుపణిక్కర్ అచ్చన్, తిరు మూల్పాదులను మూర్ఖుల్ని చేసిన ఘట్టాలు, న్యాయవాదులు కలుసుకున్న ఘట్టం, రాఘవ మీనన్ మీద కుందన్ మీనన్ తన న్యాయశాస్త్ర పద విజ్ఞానాన్ని ప్రదర్శించిన ఘట్టమూ హాస్య సన్నివేశాల కుదాహరణలు. హాస్యం, సానుభూతి, అయిష్టత, అప్పుడప్పుడు ఆవేగాల భావావేశపు తీగల్ని మీటుతూ చందుమీనన్ పాఠకుల ఆసక్తిని నిలబెడతాడు.

పాఠకులతో మనస్సు విప్పి మాట్లాడే, అసాధారణమైన ఆనందాన్ని కలిగించే అలవాటొకటి చందుమీనన్ కున్నది. మాధవన్ రాసిన ఉత్తరాన్ని చదివింతర్వాత దాన్ని ఇందులేఖ మూడు నాలుగుసార్లు ముద్దుపెట్టుకుందని పాఠకులకు చెప్పేముందు 'నాయికమీదఉన్న నా అభిమానం కారణంగా నేను కథలోని సత్యాలను అణచివేయకూడదు' అంటాడు. పాఠకులు హఠాత్తుగా తమకేదో ప్రత్యేక విషయాన్ని చెప్పడానికి చందుమీనన్ పిలుపును వినే సందర్భాలెన్నో ఉన్నాయి. పాఠకుడినుండి ఏమీ దాచకుండా ఉండాలని ఎంత ఉత్సుకత చూపిస్తాడు, ఒక పాతమిత్రుడు భుజంమీద తట్టి 'విన్నావా, నాకో విషయం తెలుసు' అని చెవిలో గొణిగినట్లుగా.

మలయాళ సాహిత్య నిర్మాతల్లో ఛందుమీనన్‌కు ఒక అత్యున్నత స్థానం ఉంది. అతడందించింది ఒక సంపూర్ణ నవల, మరో నవలలో మూడ్లో

వంతు మాత్రమే. అయినా అవి మంచి పనితనాన్ని, విశిష్టతను చూపిస్తాయి. ఆయన తన కథల్లో వాడిన వస్తువు, పద్ధతి, భాష మలయాళ సాహిత్యంలో అంతకుపూర్వం ఎవరూ వాడనివి. ఇది ఒక అపరిచితమైన మిశ్రమం. కాని ప్రజల అభిరుచికి అద్భుతంగా సరిపోయింది. ఆయనకు రచనల్లో ఏమాత్రం అనుభవమూ. అభ్యాసమూ లేకుండానే ఏదో సరదాకి, ఆ పనిమీద అభిమానంతో మాత్రమే ఆయన 'ఇందులేఖ'ను రాయడం ఆశ్చర్యకరం - అయినా అది ఆనాడు అత్యంత ప్రచారాన్ని పొందింది. ఇటువంటి విజయం ఒక ప్రతిభాశాలికి మాత్రమే సాధ్యమౌతుంది. 'ఇందులేఖ' తన పద్ధతికి చెందిన నవలల్లో నేటికీ తలమానికమని కొందరు విమర్శకులు భావిస్తారు. 'శారద నవల నాయన పూర్తిచేసిఉంటే' అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతుంటారు. తన కాలంలో సాహిత్య చక్రవర్తిగా గౌరవింపబడ్డ కేరళవర్మ వలియకోయిల్ థంపురన్ 'అసంపూర్ణంగానే శారద' ఇంత ప్రకాశించినప్పుడు, అది సంపూర్ణమయినట్లయితే ఇందులేఖ ఇందులేఖగాను (చంద్రరేఖ) శారద ప్రకాశమానమైన పూర్ణచంద్రుడుగాను భాసిల్లే'వని వ్యాఖ్యానించాడు.

పూర్వాధ్యాయంలో ఈ నవలల్లో చూచినట్లుగా సమకాలీన జీవితాన్ని వర్ణించడంలో చందుమీనన్ నైపుణ్యం గురించి చెప్పకున్నాం. ఆయన మనకు నాయర్ తార్వాడ్లు, వాటి ఆవరణలు, వ్యక్తులు, వారి దైనందిన జీవనం, వాళ్ళ వస్త్రాలు, ఆభరణాలు, వాళ్ళ సమస్యలు, అన్యోన్య సంబంధాలు వీటన్నింటి మంచి చిత్రాల నందించాడు.

చందుమీనన్ ఆసక్తిదాయకమైన సమకాలీన జీవిత చారిత్రకుడైనట్లుగానే మలబారు సాహిత్య, సాంఘిక ప్రపంచాల్లో రాబోయే సంఘటనలకు వేగుచుక్క అయ్యాడు. సాహిత్య ప్రపంచంలో 'ఇందులేఖ' అద్భుత విజయం ఉత్తమ నవలలు త్వరలోనే ప్రచారంలోనూ, స్థానంలోనూ, కవిత్వానికి మంచి ప్రతిస్పర్థులుగా మలబారులోని పాఠక సమాజంలో నిరూపించు కుంటాయని సూచిస్తుంది. ఆయన మలయాళ నవలలకు ఒక కొత్త స్థానాన్ని కల్పించాడు.

సంఘపరంగా నాయర్ తారాడ్లలో, నంబూద్రీల, కారణవన్ల ఆధిపత్యం ఇక నిరాఘాటంగా సాగదని ఈ నవల చెప్తుంది. ప్రత్యేకంగా మీనన్ అను కొన్నట్లుగానే ఇంగ్లీషు చదువుకున్న విద్యావంతురాండ్రైన నాయర్ స్త్రీలు నీతి బాహ్యులైన నంబూద్రీల స్వార్థానికి, కుటిల స్వభావా కి ఎంతమాత్రం బలి కాబోరు. సూరి నంబూద్రిపాద్ ఇందులేఖ కోసం వచ్చినప్పుడు ఆమె మొదటి సారిగా సామాన్య సంప్రదాయం ప్రకారం 'అప్పుడు ఈ నీ సేవకురాలు కింది అంతస్తులో లేదు' అనడానికి బదులుగా 'అప్పుడు నేను కింది అంతస్తులో లేను' అంటుంది. తనలాంటి అమ్మాయికి ఇటువంటి నంబూద్రీపై ఆసక్తి లేదని ఈ మాటలు సూచిస్తున్నాయి. వాళ్లు కలుసుకొన్నా వాళ్ళ మధ్య యజమాని సేవక సంబంధం ప్రశ్నే లేదు. చందుమీనన్ "ఇందులేఖ నేను అని ప్రథమైక వచన సర్వనామం ఉపయోగించడంలో నంబూద్రిపాద్ ఊపిరిసలపక ఉక్కిరిబిక్కి రయ్యాడు. ఎందువల్లనంటే ఏ నాయర్ యువతీ ఇంతవరకూ సాహసించి ఇంత అగౌరవాన్ని చూపించలేదు" అని రాశాడు. అప్పుడే ఏమయింది. ముందు చాలా ఉంది. నంబూ దిపాద్ ప్రేమ పిచ్చిలో ఎగిరి గంతువేసినప్పుడు ఇందులేఖ 'ఈ పిచ్చిచాలు. నేను బ్రతికుండగా నీ భార్యను కాను' అంటుంది. ఇది పద్దెనిమిదేళ్ళ ఇందులేఖ సూరి నంబూద్రి పాద్‌కు ఇచ్చిన తుదిదెబ్బలు. విద్యావంతురాండ్రయిన నాయర్ యువతులు, కాముకులైన నంబూద్రి లందరికీ పెట్టిన చెంపపెట్టుగా వీటిని భావింపవచ్చు.

సంప్రదాయకమైన అధికారానికి ప్రాతినిధ్యం వహిస్తున్న పంచు మీనన్ మాధవన్ ఇందులేఖనుండి కొత్తసవాళ్ల నెదుర్కొనవలసి వచ్చింది. కథా ప్రారంభంలో 'ఈ దుర్మార్గుడికి (మాధవన్‌కు) ఇందులేఖ నెప్పటికీ ఇవ్వను' అని అరుస్తాడు పంచుమీనన్. ఇది పాత వ్యవస్థ అధికారం. గ్రంథాంతంలో అతనే 'అమ్మా నీ వింక విచారించాల్సిన అవసరమేమీ లేదు మాధవన్ వచ్చిన వెంటనే నీ వివాహం జరుగుతుంది' అని ఇందు లేఖతో ప్రేమగా చెప్తాడు. ఇది కొత్త వ్యవస్థకు స్థానం ఇచ్చి తప్పుకుంటున్న పాత వ్యవస్థ. ఇది రాబోయే యువతరం తిరుగుబాటుకు, మరింత స్వాతం త్ర్యానికి చిహ్నం.

ఇప్పుడు ఒక మంచి నవలాకారుడు కావాలంటే అవసరమైన కొన్ని లక్షణాలను విశ్లేషించే ప్రయత్నం ఆసక్తికరంగా ఉండవచ్చు. మొదట పరిశీలనాశక్తితో ప్రారంభిద్దాం. ఈ వరం లేక శిక్షణవల్లనే కథావస్తువును సంపాదిస్తాడు. పెద్ద చిన్న వస్తువుల్నీ, మూర్త అమూర్తాల్నీ చూడగలగాలి. ఉదాహరణకు విశాలమైన బొంబాయి రేవు దృశ్యాన్నీ వైతిపట్టార్ కళ్ళలో క్షణకాలం మెరపునీ, పంచుమీనన్ వ్యగ్యంపై బాలుడు గోపాలన్ తిరుగు బాటునీ, పెద్దవాళ్ళ మధ్య విషాదకరమైన పోట్లాటనీ, ప్రేమికుల మధ్య మృదుత్వాన్నీ, దుర్మార్గుల దుర్మార్గాన్నీ ఒక్క చూపులో గుర్తించగల సూక్ష్మదృష్టి చందుమీనన్ కుంది.

ఈ పరిశీలనాశక్తికి ధారణాశక్తి తోడుకావాలి. ఫోటోగ్రాఫర్ ప్లేటు మీద చిత్రంలాగా పరిశీలించిన వస్తువు వెంటనే మనః ఫలకంపై ముద్రితం కావాలి, అతనికి పరిశీలనాదృష్టికాదు కెమెరా కళ్ళు కావాలి. ఇది లేక పోతే పరిశీలించిన విషయాలు మనస్సులోంచి చెరిగిపోతాయి. అంటే ఈ పరిశీలిత విషయాల సమూహంనుండి కథకుడు పరిస్థితుల కనుకూలంగా. తన అవసరాల కనుగుణంగా ఉపయోగించుకోవచ్చు. స్పందించే హృదయం రచయితలో భావోద్వేగపు ప్రతిస్పందలను పుట్టిస్తుంది. రచయిత వాటిని పాఠకులకు బదిలీచేసి నవలను మరింత సజీవంగా చేస్తాడు. భావస్పందన జరగాలంటే అతడా సంఘటనల్లో, సన్నివేశాల్లో భాగస్వామిగా ఉండి పాత్రలలో తన్మయత్వం చెందాలి. అంటే వాటిలో కొంత సన్నిహితత్వాను భూతి అవసరం.

తాను సేకరించిన వస్తుసంభారంలోనుండి ఒక భవన నిర్మాతలాగా అవసరమైన విషయాల నెన్నుకొని అద్భుతమైన నిర్మాణం జరిగేట్లుగా వాటికి యోగ్యమైన స్థానాల నివ్వాలి. వాస్తుశాస్త్రజ్ఞుడి నేర్పు కేవలం ఉపయోగించిన సాధనాలు, నిర్మించిన గదుల ఉత్తమ ప్రమాణాలనుబట్టి మాత్రమేగాక మొత్తం భవనం కన్పించే తీరునుబట్టికూడా ఉంటుంది. అట్లాగే ఒక గొప్ప నవలాకారుడి నైపుణ్యం కేవలం- ఒక్కొక్క దృశ్యాన్నిలా నిర్మించాడన్న దాని

మీదేకాక మొత్తం కథ సృష్టించిన అనుభూతిమీద కూడా ఆధారపడి ఉంటుంది. అటువంటి ఇతివృత్తాన్నెన్నుకోవడానికి, విషయాలకు వాటికి తగిన స్థానాలివ్వడానికి పక్షపాతరహిత హృదయం ఉండాలి.

ఈ విధంగా మంచి నవలాకారుడికి తన ఇతివృత్తానికి సంబంధించి తన్మయత, నిష్పాక్షికత రెండూ ఉండాలి. భాగస్వామిగాను, పరిశీలకుడుగానూ కూడ ఉండాలి. భగవద్గీతలాంటి మన మత గ్రంథాలు భగవంతుడు సృష్టి లోపలా, వెలుపలాకూడా ఉన్నాడని చెప్తాయి. తన నవలా సందర్భంగా పాత్రలూ, కథలోని సన్నివేశాల విషయంలో నవలాకారుడి పరిస్థితి కూడా ఇటువంటిదే.

తనకు తెలిసిన విషయాల్నీ, తన అనుభూతుల్నీ పాఠకులకు సంతృప్తికరంగా అందించగలిగిన సామర్థ్యం గొప్ప నవలాకారుడి కుండవలసిన మరొక ముఖ్యమైన లక్షణం. 'మాటలు, మాటలు, మాటలు' నిప్పురవ్వల్లాంటివి, చక్కిలిగింతలు పెట్టేవీ, కాల్చేవీ, చిత్రాలనూ, సంగీతాన్నీ మన ముందుకు తెచ్చేవీ, ప్రతి సందర్భానికీ తగిన పదం ఉంది.

'ఎన్నికైన పదమూ, తూచిన పదబంధమూ సామాన్యులకు దూరం.'
ఒక వ్యవస్థని, ఒక కదలికని, ఒక ఆవేశాన్ని వర్ణించడానికి సరైన పదం. 'మన యుగంలో ఉత్తమోత్తమ రచయిత' అని జీన్‌పాల్ సార్త్రె కీర్తించిన జాన్ జోస్ పాసోస్ ఒకసారి రచయితల కర్తవ్యాన్ని ఇలా సూచించాడు. "స్పష్టంగా దర్శించడమూ, దర్శించిన దాన్ని స్పష్టంగా వ్యక్తం చేయడమూ ఇప్పటికీ రచయిత లక్ష్యం. కాని ప్రపంచంలోని కథాకథన చాతుర్యం అంతా ఉన్నాకూడా దీన్ని సంపాదించడం ఎంత కష్టం!"

చందుమీనన్ గ్రంథాల్లో పాత్రలూ, సన్నివేశాలూ, కథాకథనమూ జ్ఞాపకం ఉన్న సహృదయ పాఠకులు ఉత్తమ నవలాకారుడి కుండవలసిన లక్షణాలన్నీ చందుమీనన్‌లో కావలసినంత ఉన్నాయనీ, ప్రధానంగా 'స్పష్టంగా చూసే శక్తీ, చూసిందాన్ని స్పష్టంగా వ్యక్తం చేసే శక్తీ' ఉన్నా

యని అంగీకరిస్తారు. ఆయన కెంత ప్రసిద్ధి ఉన్నదంటే ప్రఖ్యాత మలయాళీ రచయిత 'కేసరి' వెంగాయిల్ కున్హిరామన్ నాయనార్ చందుమీనన్‌తో "మీ జీవితకాలంలో మాలో ఎవ్వరూ నవలను రాయడానికి సాహసించరు" అన్నాడు.

చందుమీనన్ యాభై రెండు సంవత్సరాల వయస్సు లోనే స్వర్గస్థు డయ్యాడు. తర్వాత దాదాపు శతాబ్దంలో మూడువంతులు గడిచిపోయింది. ఇతఃపూర్వం ఎరగని తరహాలో గొప్ప మార్పుల్ని చూపిన కాలం వచ్చింది. ఈ మార్పు లన్నింటిలోనూ ఆయన పేరు ప్రతిష్ఠలు చెక్కుచెదరకుండా నిలిచాయి. ఆయన 'ఇందులేఖ'ను చదివినవాళ్లు ఆయన్ను మంచి వినోదాన్ని కలిగించే రచయితగానే కాక తన ఛలోక్తుల్నీ. రహస్యాల్నీ తమతో పంచు కునే వ్యక్తిగత స్నేహితుడుగా అభిమానిస్తారు. 'ఇందులేఖ' ఆయన మరపు రాని స్మృతి చిహ్నం. గతంలో లాగానే భవిష్యత్తులో కూడా ఈ నవల అసంఖ్యాక గృహాలకు ఆనందాన్నీ, హాస్యాన్నీ తెస్తుంది ఆయనకు పీడితుల పైన గాఢమైన సానుభూతి ఉంది. ముఖ్యంగా విద్యకు దూరంగా ఉంచబడ్డ భారతీయ స్త్రీలపై. ఒక ఉత్సాహపూరితుడైన సంస్కర్తలాగా ఈ విషాద విషయంలో నిస్తబ్ధంగా, నిరాసక్తంగా ఉన్న మనల్ని లేపి మన స్త్రీలకు కాలానుగుణమైన విద్య నివ్వవలసిందిగా అభ్యర్థించాడు. వర్తమానాన్ని అధ్యయనంచేసి భవిష్యత్తును ఊహించాడు. విముక్తులైన భారతీయ స్త్రీలకు ముఖ్యంగా మలబారు స్త్రీలకు సౌఖ్యప్రదమైన భవిష్యత్తును ఆకాంక్షించాడు.

ఈ క్రింది వాక్యాల్నిబట్టి సాహిత్యంపై చందుమీనన్ ప్రభావాన్ని అంచనా వేయవచ్చు. మలయాళీ సాహిత్యాభివృద్ధికి ఒక వినూత్న, సమృద్ధ రంగాన్ని ఆయన చూపించాడు కేవల కవిత్వమేకాక నవలలుకూడా సాహి త్యంలో గౌరవాన్నీ, ప్రచారాన్నీ పొందుతాయనే ధైర్యాన్నాయన రచయిత లలో కలిగించాడు. తమకు కథా కథన చాతుర్యమే ఉంటే ఉత్తమ నవల లను రచించడానికి భాషావస్తువుల విషయంలో తమకొక అవకాశం ఉన్న దని వాళ్లు ఆయనద్వారా తెలుసుకున్నారు. ఇటువంటి అనుకూల పరిస్థితుల్లో

అనేకమంది రచయితలు ఈ నూత్న రంగంలో ప్రవేశించారు. ఏడాది తర్వాత ఏడాది మలయాళ నవలా సాహితీక్షేత్రంలో విస్తారంగా పంటలు పండుతూ వచ్చాయి. 'ఇందులేఖ' కు పూర్వం (1890) నిజమైన మలయాళ నవల లేకపోగా 1892 లో ప్రతిరోజూ అవి సంఖ్యలో పెరుగుతున్నాయని చందుమీనన్ రాశాడు. ఏళ్లు గడిచేకొద్దీ మలయాళ సాహిత్యంలో మరే ఇతర శాఖకంటే కూడా అధికంగా అసంఖ్యాకంగా నవలలు వచ్చాయి. స్థాయిలో, ప్రచారంలో అవి మొదటిస్థానాన్ని చేరుకున్నాయి.

చేయి తిరిగిన రచయితగా అనేకమంది వృత్తి రచయితల కంటె గొప్ప వాడుగా నిరూపించుకొన్న ఔత్సాహిక రచయితగా, మలయాళ నవలా పితామహుడుగా, మలయాళ నవలా రచనలో నవీన కాంతియుత మార్గాలను తెరచిన అన్వేషకుడుగా, దేశీయుల స్వేచ్ఛనూ, విజ్ఞానాన్నీ కాక్షించిన దేశభక్తుడుగా భారతీయ సాహితీ నిర్మాతల్లో చందుమీనన్ స్థానం ఉందని నాకనిపిస్తుంది

# నోట్స్

1. మలబారు మ్యారేజ్ కమీషను నివేదికకు జతపరచిన చందుమీనన్ మెమోరాండం నుండి తీసుకున్న భాగం.

''సంబంధోత్సవంలో ప్రాంతీయ భేదాలను గూర్చి నే నిప్పుడు సంక్షిప్తంగా చెప్తాను. మలబారులో కొన్ని సంబంధ విధానాలకు సంబంధించిన ప్రత్యేక సంఘటనలను గూర్చి వివరిస్తాను. ఉత్తర మలబారులో జరుపుకునే పుడమూరి లేక వస్త్రదానాన్ని వర్ణించి తర్వాత తక్కిన పద్ధతులు దాని కంటే ఏ విధంగా భిన్నాలో చూపిస్తాను. ఉత్తర మలబారులో సంబంధం పద్ధతు లన్నింటిలోను పుడమూరి పద్ధతిని చాలా గంభీరమైందిగాను, నాగ

రిక మైందిగాను నేను భావిస్తాను. నావర్ణన మనముందున్న సాక్ష్యాన్నిబట్టి ఉంటుంది. ప్రతి పుదమూరి ఉత్సవంలోను మొదట జరిగేది ఒక జ్యోతిష్యుడు వధూవరుల జాతకాలు చూడడం. ఉభయపక్షాల బంధువుల సమక్షంలో వధువు గృహంలో ఇది జరుగుతుంది. జ్యోతిష్యుడు జాతకాలు పరిశీలించిం తర్వాత ఈ సంబంధం కుదురుతుందో కుదరదో తన అభిప్రాయాన్ని ఫలితాలనూ, లెక్కలనూ ఒక తాటాకు మీద రాసి వరుని బంధువులకు అందిస్తాడు. జాతకాలు కలిస్తే అప్పుడే అక్కడే వివాహ ముహూర్తాన్ని నిర్ణయిస్తారు. ఈ తేదీని కూడా రెండు తాటాకులపై రాసి ఒకదాన్ని వధువు కారణవన్‌కు, రెండోదాన్ని వరుని బంధువులకూ ఇస్తారు. అప్పుడు వధువు ఇంట్లో జ్యోతిష్యునికీ, వరుని బంధువులకూ విందు జరుగుతుంది. డబ్బు, వస్త్రాల రూపంలో జ్యోతిష్యుడికి బహుమానాలు ముడతాయి. ఉత్తర మలబారులోని పుదమూరీ లన్నిటిలోనూ తప్పకుండా జరిగే పుదమూరి కురిక్కల్ అని పిలువబడే ఈ ప్రాథమికోత్సవం దక్షిణ మలబారులో తెలియదు.

పుదమూరి ఉత్సవానికి 3, 4 రోజులు ముందుగా వరుడు తన కులంలో కారణవన్లనూ, పెద్దలనూ దర్శించి వివాహానికి అనుమతి తీసుకుంటాడు. ఈ సందర్భంలో వరుడు పెద్దలకు తాంబూలాలిచ్చి వివాహానికి అనుజ్ఞను పొందుతాడు. ముహూర్తం రోజున సూర్యాస్తమయం తర్వాత వరుడు తన స్నేహితులందరితో కలిసి వధువు గృహానికి బయలుదేరతాడు. ఊరేగింపుగా వెళ్ళి గృహ ముఖ ద్వారంలోనే వధూపక్షం వారిచే ఆహ్వానింపబడి వరుడిపక్షం, అతని మిత్రులతోసహా తెక్కిణి లేక దక్షిణపు హాలులో ఆసనాలు స్వీకరిస్తుంది. అప్పుడు అక్కడ చేరిఉన్న బ్రాహ్మణులకు వరుడు కానుకలిస్తాడు. దీని తర్వాత బ్రహ్మాండమైన విందు జరుగుతుంది. అప్పుడు జ్యోతిష్యుడు వచ్చి ముహూర్త సమయం వచ్చిందని ప్రకటిస్తాడు. సాంప్రదాయం ప్రకారం బహుమానాలు పొందుతాడు. వరుని స్నేహితుడొకడు అతన్ని పదిర్‌హట్టా లేక గృహంలో ప్రధానమైన గదికి తీసికొని వెళ్తాడు. వరుని పక్షం వాళ్లు తమతో బోలెడన్ని వస్త్రాలు, తాంబూలాలు

తెస్తారు. సాధారణంగా ముఖ్యమైన మత, గృహోత్సవాలను చేసే పడమటిల్లు లేక పదిర్‌హట్టాలో ఈ వస్త్రాల నుంచుతారు. ఈ గదిని అలంకరించి ఆ సందర్భానికి పడగ్గదిగా మారుస్తారు. ఆ గదిలో అనేక దీపాలను, మాంగల్యం లేక వివాహానికి చిహ్నాలయిన అష్టమాంగల్యం అనబడే వస్తువులను ఉంచుతారు. ఇవి బియ్యం, వడ్లు, లేత కొబ్బరాకులు, ఒక బాణం, ఒక అద్దం, ఒక శుభ్రమైన వస్త్రం, మంట, ఒక ప్రత్యేక పద్ధతిలో తయారు చేసిన 'చెప్పు' అనే చిన్న గుండ్రని చెక్కపెట్టె. వరుడు ప్రవేశించేసరికి ఈ వస్తువులన్నీ పైన చెప్పిన గదిలో నేలమీద పెట్టి ఉంటాయి. వరుడు మిత్రుడితో తూర్పుద్వారంగుండా గదిలో ప్రవేశిస్తాడు వధువు ఖరీదైన వస్త్రాలూ, అనేకమైన ఆభరణాలూ అలంకరించుకొని, మేనత్తో లేక కుటుంబంలో మరో పెద్దావిడతోనో కలిసి పశ్చిమ ద్వారంగుండా ప్రవేశిస్తుంది. వధువు అష్టమాంగల్యమూ, వెలుగుతున్న దీపాలకు ఎదురుగా తూర్పువైపు ముఖంపెట్టి నిల్చుంటుంది. మిత్రుడు వరుని చేతుల్లో కొన్ని నూతన వస్త్రాలు పెడ్తాడు. అతను వాటిని వధువు చేతుల్లో పెడ్తాడు. వధువు తరఫు పెద్దావిడ అప్పుడు దీపాలమీద, వధువుమీద అక్షతలు చల్లి వెంటనే వెళ్ళిపోతుంది. వరుడికి మరోపని ఉంది. తెక్కిణి లేక దక్షిణపు హాలులో తన పెద్దలకూ, మిత్రులకూ అతను కేకుల్ని, తాంబూలాల్ని ఇస్తాడు. అక్కడ చేరిన అందరికీ తాంబూలా లిస్తారు. అతిథులంతా వెళ్ళిపోయిం తర్వాత వరుడు వధువుతో పడగ్గది చేరతాడు.

ఇది ఏ విధమైన రంగూ పూయని పుదమూరి. మరుపటి ఉదయం వెట్టిలక్కెట్టు లేక సల్కారమ్ ఉత్సవం జరుగుతుంది. వరుని స్త్రీ బంధువులు వధువును భర్తగృహానికి తీసుకెళ్తారు. అక్కడ ఈ పండుగ సందర్భంగా విందు జరుగుతుంది.

(హిస్టరీ ఆఫ్ కేరళ సం. 3. పుటలు 270–272)

2. మద్రాసు ప్రభుత్వం భారత ప్రభుత్వానికి పంపిన లేఖనుండి –

శాసనాన్ని రికమెండు చేస్తూ భారత ప్రభుత్వానికి వ్రాసిన లేఖతో మలబారులోని వివాహాచారాలనుగూర్చి మద్రాసు ప్రభుత్వం ఇలా రాసింది:—

"ఈ విషయం సంక్షిప్తంగా ప్రభుత్వానికి ఈ విధంగా కనిస్తున్నది - మరుమక్కత్తాయం చట్టానికి బద్ధంగా ఉన్న తెగల్లో లైంగిక సంబంధాలు, అవి ప్రారంభమైన నాటినుండి ఉభయపక్షాలూ ఆమరణాంతం కట్టుబడి ఉండేవిగా ఉద్దేశింపబడ్డాయి. ఈ సంబంధాలు అందరికీ తెలిసేట్టుగా బాహాటంగా జరుగుతాయి. సామాజికంగా గుర్తింపబడి మతసంబంధమైన అంశం ఏమీలేని ఒక ప్రత్యేక పద్ధతికి చెందిన ఉత్సవాలతోకూడి ఉంటాయి. ఇతర ప్రాంతాలలో వివాహాలకు ఏ విధమైన గౌరవం ఉంటుందో అటువంటి గౌరవమే వీటికీ ఉన్నది."

(హిస్టరీ ఆఫ్ కేరళ సం. 3. పుటలు 291-292)

## ఉపయుక్త గ్రంథాలు


| మలయాళ గ్రంథాలు | రచయిత |
| --- | --- |
| ఒయ్యారథ్ చందుమీనన్ | మూర్కోల్ కుమారన్ |
| నావెల్ సాహిత్యమ్ | పాల్ ఎం. పి. |
| మలయాళ సాహిత్య చరిత్రమ్ | పరమేశ్వరన్ నాయర్ |
| నావెల్ స్వరూపమ్ | సురేంద్రన్ కె. |
| చందుమీనన్ - ఒరు పఠనమ్ | బాలకృష్ణన్ పి. కె. |
| ఇందులేఖ | చందుమీనన్ ఓ. |
| శారద | చందుమీనన్ ఓ. |

## ఆంగ్ల గ్రంథాలు

| | |
| --- | --- |
| ఇందులేఖ | డూమెర్గ్ డబ్ల్యు. |
| హిస్టరీ ఆఫ్ కేరళ | పద్మనాభ మీనన్ కె. పి. |